13 - 14

ఆంగీరస * 1992

SPRING & AUTUMN

సంపాదకులు :

తంగిరాల సుబ్బారావు

ఆర్వీ యస్. సుందరం



ఏ.బి. రాజ్ గారికి
ఆశీస్సులతో...
తంగిరాల
18-4-94

# చైతన్యకవిత

## 13 - 14

1992

అంగిరస

వసంతము – శరత్తు

సంపాదకులు :

**తంగిరాల సుబ్బారావు**

ఆర్వీయస్. సుందరం



చైతన్య కవితా వేదిక

బెంగుళూరు

CHAITANYA KAVITA a journal devoted to Telugu Poetry
Published by Chaitanya Kavita Vedika
R-2 Jnanabharati, Bangalore University Campus, Bangalore-56
1992, pp. iv+58.

ముఖచిత్రం : ప్రముఖకవి నగ్నముని

వెనుకవైపు : ప్రసిద్ధకవి శ్రీ ముదివర్తి కొండమాచార్యులు

అక్షరాలంకరణ : డా. పి. సి. నరసింహారెడ్డి

10-00 (ప్రత్యేక సభ్యత్వం రూ. 100-00;
జీవిత సభ్యత్వం రూ. 200-00)

ఇతర వివరాలకు :

**Prof. T. V. Subba Rao**
Chairman Department of Telugu Studies
Bangalore University
Jnana Bharati, Bangalore-560 056

రచనలు పంపాల్సిన చిరునామా :

**Dr. R. V. S. Sundaram**
Department of Telugu, I. K. S.
University of Mysore
Manasagangotri,
Mysore-570 006.

ముద్రణ :
సుధా ప్రింటింగ్ వర్క్స్, గాంధీనగర్, విజయవాడ-3

# మనవి

ప్రజోత్పత్తి సంవత్సరంలో ఒక్క సంచికను మాత్రమే ప్రచురించగలిగాం. అంగిరస సంవత్సరంలోకూడా ఒక్క సంచికను మాత్రమే అందించగలుగుతున్నాం. ముద్రణాలయపు ఇబ్బందులవల్ల ఇలా చేయవలసివచ్చింది. కవిత్వాభిమానుల అండదండలవల్ల ఇంతవరకు "చైతన్య కవిత"ను ప్రచురించడం వీలయింది. ఇక మీదటకూడా ఈ పత్రికను నిలుపుకోడానికి శాయశక్తులా ప్రయత్నిస్తామని మనవిచేస్తున్నాం.

—సంపాదకులు.

1986 లో ప్రారంభించిన ఈ మా "చైతన్య కవిత"కు
చేదోడు వాదోడుగా ఉంటున్న మాన్యమిత్రులు,
సరసులు సహృదయులు, సాహిత్యప్రియులు
బెంగుళూరు నివాసులు
శ్రీ బుల్లా సుబ్బారావు, ఐ. ఎ. ఎస్. గారికీ
శ్రీ డి. కె. ఆదికేశవులుగారికీ
సస్నేహంగా
ఈ సంచిక
మా కానుక

—సంపాదకులు

# ఈసారి వేదిక నలంకరించినవారు

శ్రీయుతులు పుట

మూర్తీభవించిన ఉద్యమప్రభంజనమూర్తి

# నగ్నముని

వి. వి. యన్. నరసింహారావు

పరిచయ వ్యాసం అక్కర్లేని కవి నగ్నముని. కానీ ఎవరి గురించైనా సరే, గుర్తు చేసుకున్నప్పుడు మరుగునవున్న మరికొన్ని వివరాలు వెలుగులో కొచ్చి ఆయా రంగాల ప్రవాహాల్ని ప్రకాశింపజేస్తాయి. అదనపు సమాచారం ఆయా వ్యక్తుల శైలినీ, వ్యక్తిత్వాన్నీ అర్థం చేసుకోడానికి ఎంతో దోహదం చేస్తాయి.

నగ్నముని- మరోపేరు మానేపల్లి హృషీకేశవరావు. ఆయన గుంటూరుజిల్లా తెనాలిలో 1940 మే 15 నాడు పుట్టారు. కృష్ణాజిల్లా బందరు, హైదరాబాదులలో చదువుకున్నారు, 1958 లో ఆంధ్రప్రదేశ్ లెజిస్లేటివ్ అసెంబ్లీలో రిపోర్టరుగా నియమితులై ప్రస్తుతం సీనియర్ చీఫ్‌రిపోర్టరుగా పని చేస్తున్నారు. ఇప్పటివరకూ భారత పార్లమెంటులోగానీ, యితర రాష్ట్ర శాసన సభలలోగానీ అతి చిన్నవయసులో ఉత్తీర్ణులై రిపోర్టరుగా నియమింపబడిన వారు మరొకరులేరని పరిగణించడము జరిగినది.

నగ్నముని, కేశవరావ్‌గా తొలి కవితా సంపుటి- "ఉదయించని ఉదయాలు" 1962 లో ప్రచురించారు.

శ్రీ కె. వి రమణారెడ్డిగారు- వినూత్నమైన, ఆరోగ్యకరమైన అభ్యుదయోద్యమంలో అప్పుడే పుట్టి ప్రసారం ప్రారంభించిన కిరణంగా గుర్తించి ఉజ్వలమైన భవిష్యత్తును కేశవరావ్‌గారికి ఆకాంక్షించారు.

"ఉదయించని ఉదయాలు" ఎన్నో రకాలుగా ఆశలు రేకెత్తించింది. రూపంలోను, వస్తువులోను ఆధునికత తొంగి చూసింది. జీవితంలోని అనేకానేక

మౌలికాంశాలను స్పృశించింది. సూటిగా ప్రకృతిలోంచి నాగరికతలోకి హఠాత్తుగా ప్రవేశించి గాఢతను తెలియ జెప్పింది. అంతేగాక- వచనకవితారంగంలో స్పష్టమైన, విలక్షణమైన కంఠంగా వినిపించింది. బలంగా ఆకర్షించింది. ఈ ఆకర్షణ చమక్కుమని మెరిసి చీకట్లో కలిసిపోయే తాత్కాలికమైనది కాదు. ఆనాడు భారతజాతి చరిత్రలో, భారతదేశ కాలగమనంలో స్తబ్ధత సంభవించి సందిగ్ధంగా ఆగిపోయిన సంధ్యాసమయం "ఉదయించని ఉదయాలు" గ్రంథానికి అన్వయంగా నిలిచిపోయింది. అది ఆనాడు శాశ్వతమైపోయిన క్షణిక క్షణం. ఆ అన్వయాన్ని ఈ విధంగా విపులీకరించారు విమర్శకులు. 1947 ఆగస్టు 15 అర్ధరాత్రి భారతదేశానికి స్వతంత్రం వచ్చింది. అయితే భారతీయుల పాలనలో సంవత్సరాలు గడుస్తున్నా నిజంగా ఆచరణలో స్వతంత్రం వచ్చిన దాఖలాలు కనిపించడం లేదు. ఆనాటి ఆగస్టు అర్ధరాత్రి గడిచి, గాఢాంధకారం తొలగి, తెల్లవారి, ప్రజల జీవితాల్లో వెలుగు ప్రసరించలేదు. అందుకే "ఉదయించని ఉదయాలు" గ్రంథాన్ని "ఉదయించని జీవితాలు"గా అర్థం చేసుకున్నారు. ఒక మహాకావ్యం ఇచ్చే సందేశాన్ని, అనుభవాన్ని ఒక గ్రంథం శీర్షికలో పొందినట్లు భావించారు. భారత పాలకుల విఫల పాలనం క్రమంగా బయటపడుతున్న ఆ రోజుల్లో సమాజంలోనూ, సమకాలీన కవుల రచనల్లోనూ దట్టంగా నిరాశవుండేది. ఎవరయినా ఆశ కల్పించడానికి ప్రయత్నించినా, ఆ ప్రయత్నంనిండా ప్రాణంలేని భావాలు, పదాలు నిండి వుండడం వల్ల కనిపించని స్తబ్ధత కదలాడుతూ వుండేది. ఇది ఆనాటి మహావిషాదం. ఇటువంటి స్థితిలో కేశవరావుగారు "ఉదయించని ఉదయాలు"లో "మనరక్తంలో రేపటి సూర్యుడు ఉదయిస్తున్నాడు చూడు" అన్నప్పుడు- రక్తంలో సూర్యుడు ఉదయించడం గమనించారు.

ఆ రోజుల్లో "భారతి"లోనూ "తెలుగు స్వతంత్ర"లోనూ తమ కవిత్వాలు ప్రచురింపబడడం యోగ్యత పత్రాలుగా, ఎవార్డులుగా కవులు భావించేవారు. అది నిజం కూడా. ఇప్పుడు ఆ ప్రామాణికత కోసం ఎవరూ ఆశిస్తున్నట్లులేదు. ఇది తప్పకుండా పట్టించుకోవలసిన విలువ. "ఉదయించని ఉదయాలు" సంపుటిని ఎంతోమంది యిష్టపడడానికి కారణం- అందులోని కొన్ని కవిత్వాలు "భారతి"లోను "తెలుగు స్వతంత్ర"లోను వెలువడ్డాయి, దీనితో కేశవరావుగారు పొంగిపోలేదు. తను రాస్తున్న కవిత్వం రూపం, వస్తువు

తెలుసు. కానీ మరింత లోతుగా తెలుసుకోడానికి ప్రాణం యిచ్చేవారు. తను రాస్తున్నది వచన కవిత్వమని తెలుసు. ఆ రూపానికి ఆయన అంకితమైనారు. మనసా, వాచా, కర్మగా వచన కవిత్వం గురించే ఆలోచించేవారు. ఆ రూపం లోనే రచనలు చేసేవారు. ఆయన పద్యాలు రాసేవారు కాదు, గేయాలు రాసే వారు కాదు, వచన కవిత మాత్రమే రాసేవారు. వనచ కవిత్వానికి ప్రాముఖ్యత గాంభీర్యం, కావ్య లక్షణాలు సంకరించడానికి, తద్వారా ప్రజలవద్దకు వెళ్ళడానికీ, ప్రజల మనసుల్లో నాలికలపై వచన కవిత్వం నాట్యమాడడానికీ ఆయన నిరంతరం తపస్సు చేసేవారు అయితే ఆయనలో వున్న ఒక ప్రధాన మైన లక్షణం తను చెయ్యదలచుకున్నదానిని నిరంతరం ఆచరణలో చూపించే వారు. ప్రకటనల్లో చూపించేవారు కాదు. "నేను వచన కవిత" మాత్రమే రాస్తాను అని అనకుండా, ఆ పనిచేసి చూపించేవారు. అదీ ఆయనపద్ధతి. వచన కవిత- ఒక గంభీరమైన అభివ్యక్తీకరణ సాధనంగా పెరగాలని ఆయన ఆలో చిస్తూ, వస్తువు గురించి కూడా విపరీతంగా అధ్యయనం చేస్తూ వుండేవారు.

ఆ రోజుల్లోనే ఆయన తీవ్రంగా ఒక అంశం గమనించారు. అదే మంటే వచన కవిత్వాన్ని ఏ విధంగా వ్యవహరించాలి ? అనేది అది తనముం దున్న సమస్య. తనకు తృప్తినిచ్చే పరిష్కారం తాను సంపాదించాలి అని ఆయన అనుకునేవారు. దేనితోనూ ఆయన తృప్తిపడలేదు. ఉదాహరణకు- శ్రీశ్రీ- వచన గీతం అని వ్యవహరించేవారు. పఠాభి, ఆరుద్ర వచన పద్యం, పజ్యం అనేవారు. కుందుర్తి ఆంజనేయులుగారు "వచన గేయం" అనేవారు. ఇందులో దేనితోనూ నగ్నమని ఒప్పుకునేవారుకాదు. ఈ రూపం గీతం కాదు. పద్యం కాదు, గేయం కాదు, వీటి లక్షణాలు, వచన సంబంధాలు కవిత్వంలో కనబడకూడదు, ఒకవేళ కనబడితే వచన కవిత్వం ఎదుగుదలకు ఆటంకం ఏర్పడుతుందని ఆయన భావించేవారు. మరీ ముఖ్యంగా కుందుర్తి ఆంజ నేయులుగారు "వచన గేయం"గా పేర్కొనడమేగాక, వచన కవిత్వం యొక్క రూపంలో అన్నిరకాల ఛందస్సుల సంబంధాలను ప్రమేయాన్ని కొనసాగిస్తూ వుండడం గమనిస్తు వుండేవారు. ఈ వైఖరి వచన కవిత్వం అభివృద్ధికి ఉపయోగపడదని అనుకునేవారు, అందుకు ఉదాహరణ- అంత్యప్రాస వచన కవితకు గాంభీర్యాన్ని యివ్వదు అనేవారు. అలాగే ఆరుద్రగారు ఇంగ్లీషుమాట ఎక్కువగా వాడడం వచన పద్యం అనడం యిష్టపడేవారు కాదు. అందుకని

గీతము, పద్యము, గేయముగాక- వచన కవిత్వం "వచన కవిత"గా పేర్కొన బడాలని కేశవరావుగారు ఆశించారు. అందుకే ఆయన ఎంతో తీవ్రంగా కృషి చేశారు. ఆయన రేడియోలో వచన కవితలు లెక్కలేనన్ని చదివారు. జంట నగరాలలో ఆంధ్రప్రదేశంలో ఎన్నో కవి సమ్మేళనాల్లో పాల్గొన్నారు. పత్రి కల్లో ప్రచురించారు. ఇక్కడ ఒక ముఖ్యమైన విషయం చెప్పాలి. నగ్నమునికి గంభీరమైన కంఠం వుంది. దానితో వచన కవితకు ఒక స్థాయిని, గాంభీ ర్యాన్ని తీసుకువచ్చే విధంగా చదివేవారు. "నగ్నముని కవిత్వం చదివితే వినాలి" అని అనుకునేవారు. ఒకప్పుడు శ్రీరంగం నారాయణబాబుగారు వచన కవిత పాడేవారట. కవి సమ్మేళనాల్లో కొంతమంది పద్యాలను, గేయాలను సంగీతం ఆధారంగా చదివే వారు. ఎటువంటి ఆధారమూ లేకుండా కవితలోని భావమే ఆధారంగా నగ్నమునివచన కవితను అత్యంతగంభీరంగా చదివి ఒక స్థాయిని సంతరించి పెడుతూవుంటారు.

దీనిని వచన కవితకు నగ్నముని సాధించిన ఒక ప్రమాణంగా స్వీక రించవచ్చు.

కేశవరావుగారు నగ్నమునిగా మారి 1965 లో మరో అయిదుగురు కవులను కలుపుకుని దిగంబర కవితోద్యమం ప్రారంభించి సమిష్టిగా మూడు సంపుటాలను ప్రకటించారు. దిగంబర కవితోద్యమం వచన కవితతో ప్రారం భించబడింది. అంటే - దిగంబర కవుల కవిత్వరూపం - వచన కవిత. వస్తువు- మన అసమగ్ర, రాక్షస వ్యవస్థపై ప్రతిఘటన ప్రకటించడం నగ్నముని దిగంబర కవితోద్యమానికి సూత్రధారి, సారథిగా వ్యవహరించారు. తద్వారా ఆయన వచన కవిత్వానికి ఎంతో సేవ చేసినట్లు చెప్పవచ్చు.

ఈ విషయం ఎందుకు ప్రత్యేకంగా చెప్పవలసి వస్తున్నదంటే దిగంబర కవితోద్యమం లేకపోతే వచన కవిత్వం యిప్పుడున్నంత సమగ్రంగా అభివృద్ధి చెంది వుండేదికాదు, ఆధునిక కవిత్వం వస్తువులేని కవిత్వంగా ఉండిపోయేది. దిగంబర కవితోద్యమానికి ముందువున్న వచన కవిత్వానికీ, ఆ తరువాత వున్న వచన కవితోద్యమానికీ సంబంధం లేదు. నగ్నముని ఆధునిక కవిత్వంలో - రూపంలోనూ, వస్తు విషయంలోనూ సాధించింది ఎంతో ఉన్నందువల్ల ప్రత్యేకంగా పేర్కొనవలసి వస్తున్నది. దిగంబర కవిత తాత్వికత - ఈ వ్యవస్థను ప్రతిఘటించడమనేది మరువరాదు.

నగ్నముని అనగానే మేధావిగా కనిపిస్తాడు. వచన కవిత్వంలో ఎంతో గంభీరమైన కవిగా ఆధునిక కవిగా కనిపిస్తాడు. నేటి రాక్షస వ్యవస్థని ఎదిరించి ప్రతిఘటించిన రెబెల్ కవిగా కనిపిస్తాడు. విప్లవ కవిగా కనిపిస్తాడు. ప్రజాకవిగా కనిపిస్తాడు. తన కవిత్వాలు రేడియోలో చదివి, కవి సమ్మేళనాల్లో పాల్గొని పత్రికలలో ప్రచురించి అంతటిలో మధ్యతరగతి కవిగా ఆగిపోలేదు నగ్నముని, దిగంబర కవితోద్యమం ప్రారంభించగానే ఆయన కవిత్వాన్ని ప్రజల దగ్గరకు తీసికెళ్ళి వినిపించాడు. పాటవలె, పద్యంవలె, గేయంవలె వచన కవితను ప్రజలకు వినిపించడం ప్రారంభించినవాడు నగ్నముని, అతను మధ్యతరగతివర్గానికి చెందినవాడైనా, ఆ వర్గంలోని వానివలె గాకుండా ప్రజలతో మమేకమై తనను ప్రజల కవిగా తీర్చి దిద్దుకున్నవాడు.

1970 లో విరసం ఏర్పడడంతో వ్యవస్థాపక సభ్యుడుగా వున్నాడు నగ్నముని. దిగంబర కవితోద్యమాన్ని ఒక యినప పీఠంగా భావించకుండా మరింత విశాలంగా, మరింత బలంగా, జనంతో మరింత సన్నిహితంగా పని చెయ్యడానికి దిగంబర కవితోద్యమాన్ని విరసంలో మమేకం చేసి ముందుకు ముమ్ముందుకు ప్రయాణించడానికి ఆయత్తమైనవాడు నగ్నముని. 1971 లో వెలువడిన "తూర్పుగాలి" కవితా సంపుటి- ఒకవైపు వచన కవిత్వానికీ, మరో వైపు విప్లవ రచనకీ ప్రథమస్థానంలో నిలచిన సంపుటి విరసం. పాటకు ప్రాధాన్యత ఇచ్చింది. దీనివల్ల చాలామంది పాట రాయడంవైపు వెళ్ళాలి. విరసం బయటవున్న కవులు పాటకు దీటుగా వచన కవితను నడపడానికి ప్రయత్నించలేదు. నగ్నముని పాటవైపు జరగలేదు. విరసం పాటకు ప్రాధాన్యత యిచ్చినందుకు నిరుత్సాహపడలేదు. విరసాన్ని అందుకు విమర్శిస్తూ కూచోలేదు. పాటకు దీటుగా వచన కవిత ఆయుధంగా మలచడానికి ప్రయత్నించాడు. దీనివల్ల వచన కవిత స్థానం మరింత సుస్థిరమైంది. అభివ్యక్తీకరణలో పదును దేలింది. "తూర్పుగాలి"లోని "పాలు ఎర్రబడ్డాయి" అనే కవిత ఎంతోమంది హృదయాల్లో చోటు చేసుకుంది. వచన కవితారూపం యిందులో ఏమి సాధించిందో గమనించవచ్చు.

1977 లో నగ్నముని నుండి "కొయ్యగుర్రం" వెలువడింది, దీనిని చే. రా. ఆధునిక మహాకావ్యంగా పేర్కొన్నారు తన ముందుమాటలో. నగ్న

మునికి ముందు దీర్ఘ కవితలు ఎవరు ఏ విధంగా రాసిందీ, అవీ ఏ విధంగా మహాకావ్యాలుగా పేర్కొనడానికి అవకాశము లేనిదీ ఆయన చెప్పారు.

ఆధునిక మహాకావ్యాల లక్షణాలు ఆయన చర్చించారు. "కొయ్యగుర్రం"లో ఒక మహాకావ్య స్థాయికి వచన కవిత రూపాన్ని నగ్నముని సాధించినట్లు చెప్పుకోవచ్చు. వచన కవిత రూపం, కావ్యం, మహాకావ్యం, ఆధునికత మొదలైన అంశాలపై చర్చ తీవ్రంగా జరగడానికి "కొయ్యగుర్రం" ఒక అవకాశాన్ని సిద్ధం చేసినట్లుగా భావించవచ్చు.

మహాకావ్యం గురించిన ఆలోచనలు ఎక్కువమందిలో సంప్రదాయ బద్ధమైన పద్ధతిలో సాగడంవల్ల కొయ్యగుర్రాన్ని సరిగా అర్థం చేసుకోలేక పోయారని చెప్పవచ్చు. చే. రా. ముందుమాటలో తెలియజేసిన ఏ ప్రతిపాద ననూ చర్చించి యింతవరకూ ఎవరూ పూర్వపక్షం చెయ్యలేదని గమనించ వచ్చు. అందువల్ల "కొయ్యగుర్రం"పై చర్చ సహృదయతతో జరిగినట్లు భావించలేము. ఆధునికత అర్థం చేసుకున్నవారు "కొయ్యగుర్రం" మహా కావ్యంగా ఒప్పుకున్నారు. రూపం విషయంలో- వచన కవిత మరింత ఆనం దించదగిన స్థానానికి చేరుకున్నదనుకున్నారు. కొత్త ప్రమాణాలు నగ్నముని ద్వారా సాధించడం జరిగిందని అనుకున్నారు.

"కొయ్యగుర్రం" కావ్యంలో వస్తువు విషయంలో కొత్త అంశాన్ని ప్రతిపాదించినట్లు భావించాలి. నేటి ప్రభుత్వాలను కొయ్యగుర్రాలతో పోల్చ డంవల్ల దాని చుట్టూవున్న అనేక విషయాలు చర్చించడం జరిగింది. తద్వారా మొదటిసారి రాజకీయ తాత్వికతను ఆధునిక కవితలో నగ్నముని ప్రవేశ పెట్టి నట్లు భావించవచ్చు.

"కొయ్యగుర్రం" రష్యన్‌లోకి ప్రొ. గురోవ్‌చే అనువదింపబడింది. డా. వెల్చేరు నారాయణరావుగారు ఇంగ్లీషులోకి అనువదించారు. ఇవి సంతోష కరమైన విషయాలు.

నగ్నముని రాసిన (1987) మరో కావ్యం "జమ్మిచెట్టు". పుస్తక రూపంలో యింకా వెలువడవలసివుంది.

నగ్నముని కవితతోపాటు కథలు రాశారు. "నగ్నముని కథలు" (1971), "నగ్నముని విలోమ కథలు" (1979) సంపుటాలుగా వెలువడ్డాయి.

"జ్ఞానమూర్తి కథలు" పత్రికల్లో ప్రచురింపబడ్డాయి. సంపుటిగా యింకా వెలువడలేదు. కథకుడిగా కూడా నగ్నమునిని గంభీరంగా తీసుకుంటారు పాఠకులు. ప్రయోజనాన్ని, ప్రయోగాన్ని రెండుకళ్ళగా చూస్తాడు నగ్నముని. జంతువు, వస్తువు, మనిషి అందరికీ సమానంగా స్థితిని యిచ్చి కథ చెబుతాడు. "సిమెంటు సంతతి" అనే కథ ఎప్పటికీ గుర్తుండేది.

నగ్నముని వ్యాసాలు కూడా ఎన్నో రాశారు. "అక్షరాయుధం" "చేదుమాట" అనే శీర్షికలతో వారం వారం ఎన్నో అంశాలమీద వ్యాసాలు రాశారు. ఇంకా పుస్తక రూపంలో వెలువడవలసివుంది. వ్యాసం నగ్నముని చేతిలో చక్కగా నడిచింది.

నగ్నమునికి నాటకరంగంతో కూడా గట్టి సంబంధం వుంది. ఇతనికి గంభీరమైన కంఠం వుండడంవల్ల ప్రథమస్థాయి కళాకారుడిగా ఎన్నో పాత్రలకు రేడియోలో గాత్రధారణ చేయడం జరిగింది.

ఆంధ్రప్రదేశ్ సచివాలయ అంతర్విభాగాల పోటీలో శాసనసభ విభాగం తరఫున ఉత్తమనటుడిగా 1963 లో ఎన్నుకోబడడం జరిగింది.

1974 లో ఉన్నవవారి "మాలపల్లి" నవలకు నాటకీకరణ చేశారు. నాటకరంగంలో దీనిని ఉద్యమంగా నడపాలని నగ్నముని చేశారు. "వంద ప్రదర్శనలు వేస్తేనే రాస్తాను" అని చెప్పి ప్రయోక్త నుండి మాట తీసుకుని ఆ తర్వాత రాశారు నగ్నముని. ఉద్యమ రూపంలోనే ప్రదర్శనాలు జరిగాయి.

"ఇక్కడ కలలు అమ్మబడుతున్నారు" అనే నాటకం రాశారు, ఉస్మానియా విశ్వవిద్యాలయం థియేటర్ ఆఫ్ ఆర్ట్స్‌వారు ప్రదర్శించారు. నాటకరంగం గురించి కొన్ని నిశ్చితమైన అభిప్రాయాలున్నాయి నగ్నమునికి, అందులో "నిత్య నాటకం" అనేది ఒకటి.

నగ్నముని నేటి వ్యవస్థ మారాలని తపస్సు చేసే ప్రజాకవీ, రచయితా, మేధావి.

దేనినయినా సరే ఉద్యమరూపంలో ఆలోచిస్తారు, ఉద్యమస్థాయిలో అమలు చేస్తారు, అందువల్ల నగ్నముని మూర్తీభవించిన ఉద్యమ ప్రభంజన మూర్తి.

# ముదివర్తివారి కవితా మూర్తిమత్త్వం

డా॥ గల్లా చలపతి, ఎం.ఏ.పిహెచ్.డి.,

మహాకవుల జీవితాలకు వారి కావ్యాలు వ్యాఖ్యానం చెపుతాయి. కవుల అంతరంగం ఒక జీవనది లాంటిది. ప్రవాహదిశలో కొండలు, గుట్టలు ఎదురైనపుడు తప్పించుకొని వాటిని ఒరుసుకొంటూ అనుకూల దిశలో ప్రవహించినట్లు కవుల జీవితాలలో తారసపడిన వివిధ సంఘటనలు వివిధ కావ్యాలుగా రూపుదిద్దుకొని సమకాలీనతకు అద్దం పడతాయి. ఆంధ్ర సరస్వతి నూపురాలను రవళింపజేసిన మహాకవి శ్రీ ముదివర్తి కొండమాచార్యుల కవితా మానసం నుండి రమారమి నలువది రసమయ కావ్యాలు జాలువారి తెలుగు పాఠకులకు అమెత లిడినాయి. ఆచార్యులవారిది "నిలువెల్ల" కవితా హృదయం. ఆ హృదయపు లోతుల నుంచి ప్రభవించిన రమణీయ కావ్య కన్యకలు ఎందరో రసికుల మానస వీధులలో వెన్నెలపూలు పూయించాయి.

ముదివర్తి వారిది ఆదర్శప్రాయమైన వ్యక్తిత్వం. వారి స్వాంతం స్ఫటికంవలె స్వచ్ఛం. ప్రవృత్తి సాత్వికం, ఆస్తిక్యబుద్ధి, ఋజువర్తనం, పరోపకార పారీణత వారి జీవలక్షణాలు. మృదు మధురమైన ఆయన మాట చెలిమిని పంచే మూట. రాసిపోసిన పాండిత్య మాయనిది. ఆయన హృదయ విపంచి కదిలితే కవితారాగం పలుకుతుంది. ఆయన ప్రజ్ఞ నిత్యనూతనం. ఆయన సత్త్వ ప్రవృత్తి కరుణారస తరంగితం. అందుకే ఆయన కావ్యాలన్నిటా కరుణ పొంగి ప్రవహిస్తుంది. స్పష్టత్వం, స్నిగ్ధత్వం, సుకుమారత్వం, రసమయత్వం- అన్నిటినీ మించి సహజత్వం ఆయన కమనీయ కవితా లక్షణాలు. ఆయన కవితా జగత్తులో ఒక వాల్మీకి, ఒక భవభూతి, ఒక తిక్కన, ఒక శ్రీనాథుడు ప్రత్యక్ష మవుతారు. ఆయన ఆలోచనల్లో ఒక రాయప్రోలు, ఒకజాషువా,

ఒక శ్రీశ్రీ, ఒక సినారె అతి సహజంగా మెదులుతారు. ఆయన ఒక మహాకవి. సంప్రదాయజ్ఞుడు, దార్శనికుడు, అభ్యుదయవాది, మానవతావాది- ఇన్ని లక్షణాలను తనలో నింపుకున్న స్థితప్రజ్ఞుడు. ఆయన ప్రాచీనులలో అర్వాచీనుడు; అర్వాచీనులలో ప్రాచీనుడు. ఆయన కవిత "పాత కొత్తల మేలు కలయిక" అయనే శ్రీ ముదివర్తి కొండమాచార్యులు.

ఆచార్యులవారి పూర్వీకులది నెల్లూరుజిల్లా కోవూరు తాలూకాలోని ముదివర్తి గ్రామం చుట్టుప్రక్కల గ్రామాలలో గుణగౌరవం కలిగిన రంగాచార్యులవారు ఆయన పితామహులు. రామకృష్ణమాచార్యులు పితృపాదులు. లక్ష్మీనరసమ్మ మాతృమూర్తి. కొండమాచార్యులు 2-9-1923 లో మైలవరం తాలూకా కుంటముక్కల గ్రామంలో జన్మించారు. మూడునెలల పసికందుగా ఉన్నపుడే తండ్రి పంచత్వం పొందడంతో లక్ష్మీనరసమ్మ బిడ్డతో ఒంగోలు తాలూకా చిలకపాడు గ్రామంలోని తన తండ్రియైన చిలకపాటి రామానుజాచార్యుల ఇల్లు చేరవలసి వచ్చింది. కొండమాచార్యులు మాతామహుల ఇంటనే పెరిగి విద్యాబుద్ధులు సంపాదించుకొని పదునెనిమిదేండ్ల ప్రాయంలో మరల తన తాతల స్వస్థానం సింహపురి మండలంలో అడుగుపెట్టి గూడూరులో స్థిరపడినారు. నెల్లూరు మండలం ఆచార్యులవారి జీవితాన్ని మార్చివేసింది. చిన్నప్పుడు తల్లి తినిపించిన ఉగ్గు తరువాత శారీరక దృఢత్వాన్ని కలిగించినట్లు పెన్నానీరం నెల్లూరు మండలంలో ఎందరికో కవితా పటుత్వాన్ని కలిగించింది. వేదం వేంకటరాయశాస్త్రి, దీపాల పిచ్చయ్యశాస్త్రి, దువ్వూరి రామిరెడ్డిలాంటి, దిగ్గంతులవంటి కవి పండితు లీమండలం వాళ్ళే. ఈ పెన్నా నీరపు వారసత్వం కొండమాచార్యులకు కూడ అబ్బింది. ఆయన మనసులో నవ్య కవితకు పాదు ఏర్పడింది. ఈ వయసులోనే ఆచార్యులు "ఇంటర్" చదివి "సెకండరీ గ్రేడు" శిక్షణ పొందారు. మద్రాసు విశ్వవిద్యాలయ విద్వాన్ పరీక్షలో ద్వితీయ శ్రేణిలో నెగ్గినారు. ఇంటర్ చదవడంతో వారికి ఆంగ్లసాహిత్యంతో కూడ పరిచయం ఏర్పడి, ఆ సాహిత్య పరిమళం తరువాత కావ్యరచనల్లో గుబాళించింది.

బిల్హణీయ కార్యకర్త చిత్రకవి సింగరాచార్యులకు ఏడవ తరం వారైన చిత్రకవి శ్రీనివాసవరదాచార్యుల పుత్రిక శ్రీమతి ఇందిరమ్మను వివాహ

మాడి గూడూరులోనే కాలు నిల(దొక్కుకున్నారు. ఒక కుమారుడు ముగ్గురు కుమార్తెలు వీరి సత్సంతానం.

శ్రీ కొండమాచార్యులు 1944 గూడూరులోనే హయ్యరు ఎలిమెంటరీ పాఠశాలలో ఉపాధ్యాయుడుగా ఉద్యోగ జీవితం ప్రారంభించి 1950 లో నెల్లూరుజిల్లా బోర్డువారి గూడూరు ఉన్నత పాఠశాలలో తెలుగు పండితుడుగా ఉపాధ్యాయ వృత్తిలో స్థిరపడి ఉత్తమ ఉపాధ్యాయులుగా మన్ననపొంది 1978 లో పదవినుండి విశ్రాంతి పొందారు. అయినా ముదివర్తివారికి కవిగానే గొప్పపేరు. ఆంధ్రకవులలో ఆయనకు సుస్థిరమైన స్థానం, నెల్లూరు కవులలో అగ్రపీఠం అతి సహజంగా లభించాయి.

1944 లో ప్రారంభమైన ఆయన కవిత్వ రచన మూడుపువ్వు లారు కాయలుగా వర్ధిల్లింది. ఆయన హృదయంలో అంకురించిన కవితా లత చిగురించి ముప్పదైదింటికి పైగా పద్యగద్య కావ్య ప్రసూనాలను విరబూచి దిగంతముల వరకు కవితాసౌరభమును పరివ్యాప్తం చేసింది. ఆయన విశ్రాంతి ఎరుగని కర్మవీరుడు. తిరుమలేశుని మహానుగ్రహంతో 1980 లో తిరుమల తిరుపతి దేవస్థానం వారి పుస్తక ప్రచురణశాఖలోచేరి ఎన్నో గ్రంథములను పరిష్కరిస్తూ కవిపండిత తల్లజుల కృతజ్ఞతలకు పాత్రులవుతూ ఉన్నారు. వీరి లేఖినీ స్పర్శవేది స్పర్శపొంది నిర్దుష్టములుగా తయారైన గ్రంథాలు నూట యాభైకి పైగా ఉన్నాయి. వీరింకా గ్రంథ పరిష్కరణకు మెరుగులుదిద్దుతూ వేంకటపతి కొలువులోనే కొనసాగుతూ ఉన్నారు.

"నానృషిః కురుతే కావ్యమ్" అన్నమాట ఆయన యెడల సార్థకమవుతుంది. వారి జీవిత విధానంలో ఆలోచనాసరణిలో ఋషిత్వం అంతర్వాహినిగా ప్రవహిస్తుంది. ప్రతిభతో పరిమళించే ఆయన పలుకులు తరతరాల భారత సంస్కృతిని అభివ్యక్తం చేస్తాయి. ఆధునిక కవులలో ఆయన చేతికి దొరికినన్ని తెలుగు పదాలు మరొకరికి దొరకలేదేమో ననిపిస్తుంది. ఆయన కవిత తెలుగు నుడికారాన్ని ఒడుపుగా పట్టుకొని, వింతసొగసులను సంతరించుకొని సహృదయ హృదయాలలో రసానంద మధువును నింపుతుంది. సమకాలీన సమాజంలోని భిన్న సంఘటనలు వారి మనోముకురంలో ప్రతిఫలించి రసమయ కావ్యాలుగా రూపుదిద్దుకొన్నాయి. తరిగిపోతున్న మానవత్వపు విలువలను గుర్తించి వాటిని

తన కావ్యాలలో సుప్రతిష్ఠితం చేశారాయన. కవితా వస్తువును సానుభూతితో ఆర్ద్రతతో చూడడం ఆయన స్వభావం. ఆయన కావ్యాలలో నవరసాలు ఆవిష్కరింపబడినా కరుణ రసానికి అప్రయత్నంగానే అగ్రస్థానం సిద్ధించింది. అందుకు కారణం ఆయన హృదయ మార్దవం.

ప్రాచీన భారతీయ మూల్యాలైన శాంతి ధర్మాలను తన కవితల ద్వారా నిలబెట్టాలన్న "ధర్మదీక్ష"తో ఆచార్యులవారు కలం పట్టుకున్నారు. ఆయన లేఖిని నుండి మొదట వెలువడిన కావ్యం ధర్మదీక్ష (1944). శిశు నాగవంశపు బింబిసార మహారాజు నిధనానికి కారణమైన అజాతశత్రువు మనస్సు ఆ పిదప శోకవ్యాకులమై జీవకారుణ్యమూర్తి గౌతమబుద్ధుని శాంతి బోధతో ఊరట పొందడం ఇందలి కథాంశం. వస్తువు అద్భుత రసపు సుడి గుండములుగల కరుణరసవాహిని. అద్భుత నిర్వహణతో అవతరించిన ఈ కథా కావ్యం ముదివర్తికి వెళ్లపిళ్ల, రాళ్లపల్లి, వేటూరి, రాయప్రోలువంటి ఉద్దండ కవి పండితుల ప్రశంసలను లభింపజేసింది. ఆచార్యులవారి భావనా విన్యాసానికి పరమావధియైన మరొక కావ్యం అమరసందేశం (1947). అనారోగ్య కార ణంగా కవి హృదయంలో ఏర్పడిన తాత్వికాలోచనలకు రూప మీ కావ్యం. శ్మశానంలో ప్రత్యక్షమైన మృత్యుదేవతకు కవికి మధ్య జరిగిన సంభాషణ ఇందలి కథాంశం. ఈ రెండు కావ్యాల రచన ఆచార్యుల కవితా జీవితగతిని మార్చింది. మనిషి మనుగడకు సోపానాలైన శాంతిధర్మాల స్థితిగతులను చరిత్ర మార్చింది. కవిగారి హృదయంలో చారిత్రకాభినివేశం పొంగి పొరలి "వీరమనీడు" అనే చారిత్రక కావ్యం (1948) ఆవిర్భవించింది. ఈ కావ్యం పతితలను శ్రీకృష్ణదేవరాయల ఆస్థానమునకు కొనిపోయి శాంతిధర్మాల రక్షణ బాధ్యత రాజదండముదేనని తెలియజేస్తుంది.

కరుణరసప్లావితుడైన ఈకవి అమృతలేఖిని నుంచి ఒకదాని వెంట మరొకటిగా వెలువడిన నారాయణమ్మ (1965), కూనలమ్మ (1970) పూర్ణా హుతి (1977) కావ్యాలు ఇతివృత్తి గౌరవమునే కాక కవితామాధురిని కూడ పండించుకొని తెలుగు ప్రజల, తెలుగుకవుల నీరాజనాలందుకున్నాయి. స్నేహ పరమావధియైన ప్రేమకోసం పతితో సహగమనం చేసిన పంటరెడ్డి పేరంటాలు నారాయణమ్మ.

నారాయణమ్మ కావ్యాన్ని కరుణరస ప్రధానమైన జాతీయ ప్రబంధ మని కవి పండిత విమర్శకులంతా ముక్తకంఠంతో శ్లాఘించారు. తెలుగు తెలిమల్లియల తేనెల కమ్మని విందు పెట్టే కావ్యమిది. ఈ కావ్యరచనతో ఆచార్యులు జాతీయ కవుల జాబితాలో చేరిపోయారు. పిల్లి, పిల్లి పిల్లల మధ్య గల అనురాగానికి మానవ మనసులలో ఏర్పడే భావపరంపరతోగల సంబంధాన్ని నిరూపిస్తూ రచించబడిన మరొక మధుర ఖండం "కూనలమ్మ". పిల్లి కనిపిస్తేనే అపశకునంగా భావిస్తున్న కాలంలో పిల్లులలో కలిగే భావ ప్రకంపనాలను కథాంశంగా తీసుకోవడం ఆచార్యుల సమ్యక్ దృష్టికి తార్కాణ. వేమాలశెట్టి అనే నెల్లూ వైశ్య ప్రముఖుడు బావిలో ఉదకప్రాప్తికోసం చేసిన ఆత్మార్పణంతో "పూర్ణాహుతి" కావ్యం కరుణలో మునిగిపోయింది.

కమ్మని పద్యం వ్రాయడమేగాక కండగల వచనం వ్రాయడం కూడా ఆచార్యులవారికి "నల్లేరుపై బండినడక". సుతిమెత్తని "అలతి అలతి" తెలుగు పలుకులతో పిన్నలను ఆకర్షించే నేర్పు, కఠిన శబ్ద సంయోజనతో ప్రౌఢపాఠకులను ఆకట్టుకునే నేర్పు వీరి వచన రచన కుంది. తుగ్లక్ (త్యాగమూర్తి) కనిష్ఠ భిక్షువు, కుమార రాముడు, గౌతమ చరిత్ర, బలినిషేధము (రాజర్షి), ప్రచండ కౌశికము, అగస్త్యుడు మొదలైనవి నవలారూపంలో రచింపబడిన గద్యకృతులు పౌరాణిక చారిత్రకాంశాలు కథారూపంలో విద్యార్థుల మనస్సుల కెక్కించుటకు ఈ రచన లెంతగానో తోడ్పడుతున్నాయి. అవ్యాప్తి, అతివ్యాప్తి దోషాలు లేకుండా వక్తవ్యాంశాన్ని సూటిగా వ్యక్తపరిచే నైపుణి వీరి వ్యాసాలలో, సమీక్షలలో కనిపిస్తుంది. వీరి వ్యాసరాజాలు నెల్లూరినుంచి వెలువడే "జమీన్ రైతు" వారపత్రికలో ముద్రితాలైనాయి.

భారతీయులు రక్తంలో ప్రవహించే భారతీయాత్మను సుస్థిరం చేయాలనే స్థిర సంకల్పం ఆచార్యులవారి రచనలన్నిటా కనిపిస్తుంది. దేశమన్నా, దేశ ప్రజలన్నా ఆయనకుగల అభిమానం కవితా దర్పణంలో ప్రతిఫలిస్తుంది. గత వైభవం ఆయన కవితాఖండికలలో ఆవిష్కృతమవుతుంది. పద్య గద్య కావ్యాలేకాక వారి ముక్తక రచనలెన్నో వివిధ సందర్భాలలో పత్రికలలో కనిపించి ఆయన కవితాత్మను అజరామరం చేశాయి. భావితరాలవారికి ఆశాజ్యోతులైన గాంధీ, నెహ్రూ, శాస్త్రీజీలవంటి మహానాయకుల నిర్యాణ సమయాలలో వారిని స్మరిస్తూ, సాహిత్యారామాలలో వెలుగుపూలు పూయించి కన్న

మూసిన పింగళి, దీపాలవంటి మహాకవులను స్మరిస్తూ రచించిన స్మృతిఖండికలు వీరి నైరాశ్యాన్నీ, కర్తవ్యబోధనూ వ్యక్తంచేసే ఇక్షుఖండాలు. వీరి ముక్తకాలలో కొన్ని "ముక్తావళి" పేరుతో ఒక గ్రంథ రూపంలో ప్రకటింపబడినాయి. ఈ గ్రంథంలోని "శక్తి రథోత్సవం" అనే గేయ ఖండిక భారతదేశంపై చైనా దురాక్రమణ జరిపిన సందర్భంలో రచించబడి భారతీయులలో నిద్రాణమైయున్న ఉత్సాహశక్తిని ప్రజ్వలింప జేసిన నిప్పు కణిక.

వీరి కావ్యాలలో నాలుగైదుసార్లు ముద్రించబడని పుస్తకమేదీ లేదు. వీరికి విశేషమైన కీర్తిని తెచ్చిపెట్టిన "నారాయణమ్మ" ఐదారుసార్లు ముద్రింపబడడమేకాక ఆంధ్ర, ఆంధ్రేతర ప్రాంతాల విద్యాలయాలలో పట్ట పరీక్షలకు పాఠ్యగ్రంథంగా స్వీకరింపబడడం ఈ కావ్య మహత్యానికి నిదర్శనం. వీరి రచనలు ఉన్నత పాఠశాలా స్థాయినుంచి స్నాతకోత్తర స్థాయివరకు పాఠ్య గ్రంథాలుగా, ఉపవాచకాలుగా గ్రహింపబడటానికి కారణం ఆయా గ్రంథాల నిసర్గ కవితాశక్తి సౌగంధ్యమే. తన కావ్యసుమాలతో శారద నర్చించిన ఈ కవితా విశారదునికి జరిగిన సన్మానాలు ఇన్నని చెప్పలేం. ప్రజాహిత సంస్థలు, పండిత పరిషత్తులు, కళావేదికలు ఈ నిత్యనూతన కవి వతంసుని సన్మానించి తమను తాము గౌరవించుకున్నాయి.

నెల్లూరు కవిత్రయ జయంతులలో, తిక్కన తిరునాళ్ళలో, చిత్తూరు శ్రీరామ విలాస సభలో, నంద్యాల పింగళి సూరన జయంతిలో, గూడూరు కవికోకిల జయంతిలో జరిగినవి ఘన సన్మానాలు. వీరి కావ్యావిష్కరణ సందర్భాలలో, ఇతర కవులపేర ఏర్పాటైన సభలలో వీరు పొందిన సత్కారాలు ఎన్నో ఉన్నాయి.

ఆచార్యులవారి కవితకు లాలిత్యం ప్రధాన గుణం. అది ఆయన మనఃప్రవృత్తిలో కనిపించే లక్షణం. సనాతన పంథాను అభ్యుదయ రీతిలో అభివ్యక్తం చేసే చాతుర్యం ఆయన కలానికుంది. ఆయన ఆస్తికుడు. బాల్యం నుండి తిరుమలేశుని పాదాలు నమ్ముకున్నవారు. అధ్యాత్మ రామాయణాది మహాకావ్యకర్తయైన నాయుడుపేట వాస్తవ్యులు ఉప్పల నరసింహశర్మగారు వీరి

గురువు. ఈ వాతావరణం వీరి మానసాన్ని సంప్రదాయబద్ధం చేసింది. అయినా ప్రాపంచిక జీవితంలో ఎదురైన ఒడుదుడుకులు వీరి ఆలోచనకు అభ్యుదయపు పదనుపెట్టి మంచిని పెంచమని గళమెత్తే కవిగా మార్చాయి. నూతన కవితా వస్తువులతోపాటు ఆయన వాడిన ఛందస్సులో కూడ నవ్యత కనపడుతుంది. ఆధునిక కవులు ప్రాచీన ఇతివృత్తాలను గ్రహించడం అంతగా అరుదు. ధార్మిక, చారిత్రక, ఆధ్యాత్మిక విషయాలను ప్రతిబింబించే ఇతివృత్తాలను కావ్యాలుగా మలచిన ఆధునిక కవి మూర్ధన్యుడు ముదివర్తి. ఈయన కావ్యాలు మధునాపంతుల, గడియారం, వానమామలైగార్ల పంక్తిలో వీరిని నిలుపుతాయి.

అన్నీ ఒక యెత్తు; ఇప్పుడు ఆచార్యులవారు సాగిస్తున్న కవితా వ్యాసాంగం ఒక యెత్తు. ఉద్యోగపు ఇసుక డొంకలలో తిరుగాడి అలసిపోయిన కవిగారి మనసులో 1986 లో మళ్ళీ కవిత్వ సృజనా కాంక్ష మోసులెత్తింది.

1980 నుంచి తిరుమలేశుని కొలువులో ఉండటం మూలాన తాళ్లపాక కవుల సంకీర్తన వాఙ్మయంపై ఆయన దృష్టి ప్రసరించింది. వేంకటపతి ప్రేరణే దీనికి కారణ మంటారు వారు. తాళ్లపాక కవులలో అన్నమయ్య, ఆయన కుమారుడు పెద తిరుమలయ్య, మనుమడు చిన తిరుమలయ్య రచించిన ఆధ్యాత్మిక సంకీర్తనలలో ముఖ్యమైనవి ఎన్నుకొని వాటిని సీస పద్యాలుగా రచిస్తున్నారు. సంకీర్తనలలోని విషయ క్లిష్టతను, భాషా క్లిష్టతను తొలగించి తన కవిత్వాంశను పొదిగి మూలార్థాన్ని వెంటనే స్ఫురింపజేసే లక్షణం ఆచార్యులవారు సీసపద్యాలలో సాధించారు. ఇప్పటికి అమృతసారం, బ్రహ్మ గాంధర్వం, అన్నమయ్య విన్నపాలు, ఆనందనిలయం, శ్రీనివాస తేజం అనే పేర్లతో ఐదు సంపుటాలు మొత్తం పదమూడు, పద్నాలుగు వందల సీస పద్యాలతో వెలువడినాయి.

ఆత్మోద్ధరణకు అష్టాక్షరీ మంత్రంవలె అనవరతము జపించదగిన పదములు తాళ్లపాక మహాకవులవని వారి విశ్వాసము ఈ తాళ్లపాక కవుల

అధ్యాత్మ సంకీర్తనలే రెండున్నర వెయ్యివరకు ఉన్నాయి. వీటిలో సగం పాటలకైనా పద్యరూపం కల్పించలేకపోయానని ఆయన విచారపడుతూ ఉంటారు. ఆధ్యాత్మిక కీర్తనలవిషయమే ఇలాఉంటే ఇక శృంగారసంకీర్తనలకు కూడా కొన్నింటికి పద్యరూపం కల్పింపమనికోరే మా బోంట్ల కోరిక ఎప్పుడు తీరుతుందో తెలియదు. శ్రీనివాసుని పుస్తకప్రచురణశాఖలోని పనులతో సతమతమవుతూ, తాళ్లపాక సాహిత్యాంబుధిలోని సారామృతం సీసాలలో నింపుతూ, తీరిక ఎరుగని "ఈ విద్వత్కవి శిరోమణి" ప్రతిరోజు సాయంత్రం పూట ఆస్తిక్యబుద్ధిగల పుర ప్రజలచేత గీతాపారాయణం చేయించడం మానరు. వివిధ సాంఘిక విషయాలను పరిచయం చేసే శ్రీనాథుని క్రీడాభిరామం ఫక్కిలో తమ సమకాలీన విశేష విషయాలను జోడించి "కవనాభిరామ"మనే గ్రంథాన్ని సృష్టించాలని కూడ ఈ మహాకవి అభిలాష.

ముదివర్తివారు డంబ మెరుగని నిరాడంబరులు, నిరంతర సాహితీ వ్యగ్రమానసులు. ఉత్తమ గుణభాసురులు, దైవభక్తి తత్పరులు. నిర్వ్యాజమైన స్నేహాన్ని పంచే మధుర స్వభావులు. సమకాలీన కవి పండితుల మెప్పు పొందిన మహనీయులు. ఆంధ్రదేశం గర్వించదగిన మహాకవి పండితులు.

# న గ్న ము ని

## రచయిత రాయని నాటకం

ఒక మహానాటకం నడుస్తోంది
నాటక వేదిక భగభగ మండే భారతదేశం
బహుశా బ్రహ్మగానీ బ్రహ్మంగారుగానీ
వ్యాసుడుగానీ వాల్మీకిగానీ
ఈ నాటకాన్ని రాసిన దాఖలాలు లేవు
ఇంత రాక్షసంగా ఏ రచయితా రాయడు
ఇంత హీన విలువలు
ఏ రచయితా వూహించలేడు
దీన్ని నాటక మందామా, 'ప్రహసనమందామా"
రాజకీయ మందామా
లేక వ్యాపార మందామా
ఇక్కడ రాజకీయమే
రంజయిన వ్యాపారం
ఆర్భాటం తప్ప
ఆశయం లేని నటులు
రంగులూ హంగులూ తప్ప
వాక్శుద్ధిలేని నటులు
ఆర్భాటం తప్ప
ఆత్మలు లేని నటులు
తెరముందొక మాట
తెరవెనుకో మాట
ప్రజాసేవ పేరుపెట్టి
ఆడుతున్నారో మహానాటకం
ఇది రచయిత రాయని నాటకం
ఆరంభం అంతం సమయం సందర్భం
ఫలితం ప్రయోజనం యిందులో శూన్యం
నిన్నటి నాయికుడు

నేటి ప్రతి నాయకుడు
రేపు మరింత పెట్టుబడిపెట్టే
బడా నాయకుడు
ఎప్పుడోగాని రంగం మారదు
ఎప్పుడోగాని ప్రవేశించిన పాత్ర
నిష్క్రమించదు
ఈ రాజకీయంలో
రాద్ధాంతమే సిద్ధాంతం
మృత్యువు కబళిస్తే తప్ప నిష్క్రమించరు (కాని)
మృత్యువును కూడా భయపెట్టే నాయకులు
ప్రజలే యీ పాత్రధారులను
బలవంతంగా యీడ్చేస్తే తప్ప
రంగస్థలం విడిచిపెట్టరు
ఈ నాటక రసం
వీరం కాదు, ఉత్తి విషాదం కాదు
హాస్యం కాదు, ఉత్తి అపహాస్యం కాదు
శృంగారం కాదు, ఉత్తి శృంగభంగం కాదు
నాయకులు
ప్రజల పచ్చినెత్తురు పట్టపగలు
తేనెలాగా జుర్రుకుతాగే భీభత్సం
ఎన్నికలప్పుడు తెరలేస్తుంది
మైకుల మైకంలో
వాగ్దానాలు గుప్పిస్తారు
అబద్ధాన్ని నిజమని నమ్మింపజేసే
నిజాన్ని అబద్ధంగా భ్రమింపజేసే
ఈ నాటకాన్ని ఏ రచయితా రాయలేడు
ఏ రచయితా యింత కర్కోటక నాటకం రాయలేడు
ఈ రాజకీయ వ్యాపారంలో
పేదల బాధలకి కన్నీళ్ళు కారుస్తూ
మధ్య మధ్య తమ రంగులు

వెలిసిపోతున్నాయేమోనని వులిక్కిపడి
తాము సాగిస్తున్న
రాజకీయ ప్రయోజనం
ప్రజలకు-బీద ప్రజలకు
సమాజ న్యాయం చేకూర్చడమేనని
భూమి ఆకాశం బద్దలయ్యేట్లు
నినాదాలు యిస్తారు
అహింస మన ధర్మమని
లాఠీలతో చెబుతారు
ఇక్కడ రాద్ధాంతమే సిద్ధాంతం
ఆర్భాటం తప్ప ఆశయంలేని నటులు
ఇక్కడి రాజకీయం
వ్యాపారాలన్నిటికీ సామ్రాట్టు
మహావ్యాపారం మహోన్నత వ్యాపారం
ఇక్కడ
ఒకమనిషికి మరో మనిషి దొరికాడు
ఒకమనిషికి మరో మనిషి పట్టుబడ్డాడు
ఒకమనిషిపై మరో మనిషి లంఘించాడు
ఒకమనిషికి మరో మనిషి ఆహారంగా మారాడు
ఇక్కడ ఒక మనిషి మరో మనిషికి పెట్టుబడిగా మారాడు
ఇక్కడ
ఊహించలేనంత పోటీ జరుగుతోంది
ప్రజాసేవ చెయ్యడానికి పోటీ పెరుగుతోంది
ఇంక చాలు
ప్రజలు ప్రేక్షకులుగా వుండడమో
నిర్మాణ వేత్తలుగా మారడమో
నిర్ణయించుకోవలసిన సమయం ఆసన్నమైంది
ఇంకచాలు
ఇది-ప్రజలే తెరదించవలసిన నాటకం
ఇది-ప్రజలే తీర్చిదిద్దుకోవలసిన సమాజం

—/—/—

## మాదిరాజు రంగారావు

### ప్రయాణ రహస్యం

మనస్సు బింబిస్తుంది
సమయ తలం స్క్రీన్‌పై
లోకంలో కన్పించే జీవితం
జీవితంలో కన్పించని దృశ్యం

ఉదయ పరిమళంతో
హృదిలో శబ్దం రాగమయ్యేను
శ్రమ జల కణ పంక్తితో
మనిషి శక్తి తోరణమయ్యేను

శబ్దం ఒక పథం
అర్థం ఒక ప్రయాణం
శబ్దంతో శబ్దం కలిసి
అర్థంతో అర్థంచేరి
సరికొత్త అనుబంధంతో
అనుకోని అనుభవ ప్రపంచం

ఎగిరే పక్షి వశం ఆకాశం
రాత్రి పక్షి కాశ్రయం వృక్షం
పుష్ప రసం మధుకరానిది
తీగె ధరణిదీ పూవు గాలిదీ

శ్వాస తీసుకొనే ప్రాణిది గాలీ
మబ్బు ఎవరిదైతేనేం గాని
వర్షం మాత్రం కర్షకునిదీ
నీరు దాహంతో ఉన్న ప్రాణిదీ

నేలపై జడంలో చలనరేలం రావాలనీ
కొండరాళ్ళ శిల్పంతో పరవశించాలనీ
మనిషిలో సంకల్పం ! విశ్వకీర్తి సోపానం

అంతరంగ దీపంతో మరోమనిషి
లోపల మూసిన తలుపులు తెరుస్తూ
లోపల తెరచిన తలుపులు మూస్తూ
ఆలోచనల్ని అందంగా తారుమారు చేస్తూ

చేతిలో ఆయుధం చేనికి ?
ఎందుకో ఎవరికోసమో ! తెలిస్తే
చరిత్ర రూపం వేరుగా ఉండేది
సామాన్యుని ప్రస్థానం వెరయ్యేది

అంతరంగ సౌందర్య సౌరభంతో
మనిషి చుట్టూ రావాలి హరిత వనం
జల జల రసధారల తళతళతో
భౌతిక గతిలో చూడాలి సౌభాగ్యం

బాట మొదలు విమాన పథం దాక
యాత్రకు రూపాలెన్ని మారినా
ప్రతీముఖం తిలకించే దృక్కులు
మానవతా హృదయంకై వెదకేను
విశాల ధరిత్రిపై
ప్రయాణ చరిత్రలో

# శిలాలోలిత

## వయసు ఆవిరైన వేళ

ఇవి నా కళ్ళుకావు
కనురెప్పల దడి సడలిన ఫౌంటెన్లు
చిత్రకారుడు గీసిన గీతల్లా
నా ఒళ్ళంతా ముడతలు ముడతలుగా మారిపోయింది

ఈ కాళ్ళు నిస్సారమైన ఊతకర్రలు
ఇప్పుడు నా జీవితం నిర్వచనం వేరు
ఎముకల హేంగర్‌కు వేళ్ళాడుతున్న తోళ్ళ సంకలనం నా రూపం
నేను నేను కాదని అద్దంముందు సముదాయించుకోబోతాను
తీరా జీవితాన్ని కళ్ళముందు పోసుకొని ఓడిపోతుంటాను

పుట్టిన క్షణాల్నించీ అమ్మానాన్నల్ని, నా అర్ధ స్వప్నాన్ని
పొత్తికడుపులో తన్నే పసిగుడ్డును సమంగానే ప్రేమించాను
సముద్రంలా ఎగిసిపడే అవయవాల కెరటాల హోరులో
వెలుగూ వెన్నెలా తప్ప చీకటిని గుర్తించలేను
ఎప్పుడూ పాము కుబుసంలా జారిపోయే
సంవత్సరాల్ని పసిగట్టనైనా లేదు

ఇవాల్టికి ఈ బాదం చెట్టుక్రింద తాటిపీచైన జుట్టును
వణికే వేళ్ళతో సవరిస్తూ–
కాలాన్ని అంకెలుగా లెక్కిస్తున్నాను
ఈ శరీరాన్ని పొగడ్తలఉట్టిమీంచి
వాస్తవంలోకి దించుతున్నాను

నా ముందు గతం ఆలోచనలూ, బాధ్యతల సంకెళ్ళూలేవు
ఇప్పుడే పుట్టిన పసికందులావుంది మనసు
బోసి నవ్వుతో, బోసి గుండెతో, బోసి శరీరంతో
ఆకాశంలోకి పక్షిలాగ ఎగరాలని తపన

సూర్యుడ్ని, చంద్రుడ్ని వరసెట్టి అడగాలనుకుంటాను ఇప్పుడు
అందరు అమ్మఒడిలోంచి పాతాళానికి తోసేశారుకదా!
నువ్వైనా ఆహ్వానిస్తావా?
ఆకాశంలో సగాన్నికదా నేనూ అని

# సంయుక్త కవిత

(అఫ్సర్, ఆర్వీయస్. సుందరం, ఎండ్లూరి సుధాకర్
పతంజలిశాస్త్రి, సీతారాం)

## వలస పక్షుల గానం

ఎక్కడికైనా ఈ అరక్షణాన్ని
తరలించాల్సిందేనా?
ఎప్పటికైనా ఈ సుషుప్త దేహాన్ని
తరలించాల్సిందేనా?
అనుక్షణిక నిర్వేదాల లోయల్లోంచి
అనంత నిశ్శబ్దంలోకి
ప్రశాంత శబ్దవనాల్లోకి
గుండెమీద గడియారంలా మోగుతున్న యుగయుగాల భారాన్ని
గదిగోడలమధ్య బంధించిన వేనవేల సముద్రాల్ని
ఏమీ తెలియని స్తబ్దసందేహాల సమూహంలోకి
ఇక పరిగెత్తవలసిందేనా?
అవును, వలస తప్పదు
కాలమే ప్రవాసంలో వుంది కదా
పోతూనే వుండాలికనుంచి
అటునుంచి ఇటుకు
అజ్ఞానంలాంటి చిక్కటి చీకటిలోంచి వెలుగులోకి
ఆకాశ దూరాల్ని అధిగమిస్తూ
పుట్టెడు దుఃఖమై సాగిపోతుండాలి
దేహంలోపలి శూన్యాన్ని బయటి శూన్యంతో అనుసంధిస్తూ
కదలని భూముల్ని వొదిలి వచ్చిపోయే కలల్నొదిలి
కరిగి కరిగి గడ్డకట్టిన ఆకాశాన్ని వొదిలి
కాలంలోంచి కాలంలోకి

వలస తప్పదు
రెక్కలున్న దేహాలన్నీ ఎగరలేవు
కాలంలోంచి కాలంలోకి కదలలేవు
ఎటునుంచి ఎటుకు ఈ కాయాన్ని తీసికొని
బయలుదేరాలి?
ఖాళీకాయమే బరువైనప్పుడు
చివికిపోతున్న చర్మడేరాల్ని ఛేదిస్తూ
పడమరనుంచి తూరుపుకి
మరోకాలానికి మరోస్థలానికి
మరోకాయానికి పోవాలిప్పుడు
అస్థిపంజరాల అస్తిత్వపు బంధనంలోంచి
ఒక గాఢ తమస్వినీ గర్భంలోంచి
చక్కటి రెక్కలల్లారుస్తూ
మళ్ళీ కాలంలోకి కాయంద్వారా పోవాలిప్పుడు
ఆకాశానికి అవతలా
భూమికి ఇవతలా
కాలం గుండెకాయలా కొట్టుకునే చోటుకి
ప్రవాసమూ తప్పదు
ప్రయాణమూ తప్పదు
ఒక ధాన్యరుతువులోకి
ఆకలిపాత్ర పట్టుకుని
దేహవీణ మోహనరాగమయ్యే స్వప్న సంగీతంలోకి
ఒక మానవ గీతాన్ని
సామూహికంగా ఆలపించే సామసభామంటపంలోకి
పాటలు పాటలుగా ప్రవహిస్తూ
ప్రవాసమూ తప్పదు
ప్రయాణమూ తప్పదు

ఇక్కడ మొదలయ్యే పయనానికి
ప్రారంభ గీతమూ తప్పదు

2

కొత్తపాట నినదిస్తున్నచోట
పంజరాలు బద్దలవుతాయి
అనాదిగా ఈ పక్షి
ఆకాశాన్ని చుట్టుకున్న అదృశ్య గోడల్ని
వెన్నెల రెక్కలతో కూల్చుతోంది
క్షణాల వేరళ్ళని రాల్చుకుంటున్న చెట్లదేహాల్లోకి
పాటల్ని నెత్తురుగా వొంపుతోంది
అనాదిగా ఈ పక్షి సంచార స్వప్నాల్ని మోసుకుంటూ
ఎక్కడో ఒక అర్ధ నిమీలిత నేత్రాంచలాల మీద వాలుతుంది
నెత్తురోడే గాయాన్ని కుట్టుకుంటూ
అనాది గాయాన్ని ఆలపిస్తూనే
కొత్త గూటివైపు సాగిపోతుంది
కొత్తపాటని మాత్రమే దిక్కుల మధ్య
గాయంలా అల్లుకుంటూ పోతుందీ పక్షి
ఇక్కడ సరిహద్దులు నిషిద్ధం
పొట్టచుట్టూ పాకుతున్న పరిమళమే సరిహద్దుగా
ఎగిరిపోతున్న రెక్కలకింద
దిక్కులు కొత్త కలల్ని చూస్తాయి
కళ్ళు పుట్టినచోట కలత నిదుర తప్పదు
ఏమీ ఎరుగని నదుల్ని
తన చుట్టూ గిరి గీసుకుని
ఒక సంక్షుభిత ఆవర్తంలో విస్తుపోయి నుంచున్నప్పుడు
ఇంకా అనాది గీతాన్నే ఆలపిస్తోంది పక్షి
పంజరాలు బద్దలవుతున్న దృశ్యం
వియత్తలం స్వాగతమవుతోన్న సన్నివేశం
రాత్రంతా పులుగు గుంపుల్ని

కడుపులో దాచుకున్న చెట్టుతల్లి
ఉదయ స్వప్నాలుగా శ్వాసించే తూర్పు స్పర్శలో
వామన పిట్టలు విశ్వమంతా
పరివ్యాప్త మవుతోన్నదశ
అకాశమంతా అవరించి
భూమినిండా విస్తరించి
పక్షుల వలసగానం అలపిస్తున్నచోట
పంజరాలు బద్దలవుతాయి
పక్షులన్నీ విడుదలవుతాయి
వాటి రెక్కలకింది అనంతమైన నీడల
బరువును మోస్తుంది భూమి
ఆ నీడలు అనంత యాత్రకు ఆయత్తమవుతాయి
అకాశమంతా రెక్కలు విప్పుకున్న మౌనంతో
నిండుతుంది
శబ్దం మూగదై
భూమ్యాకాశాల మధ్య
సౌందర్య కవితా ప్రవాహమై ఎగురుతుంది
పక్షులు ఏమీ మాట్లాడవు
ఇదొక వెతలకల
ఇదొక మూగభాషకి ముందుమాట
ఇదొక సంచార స్వప్నాల కదిలే నీడ
ఇక్కడ రెక్కలు విప్పిన పాటల అలికిడి
ఇక్కడ గుండెలు కలల్లోకి కదుల్తున్న సవ్వడిగా
అవతరిస్తున్న పక్షుల గీతం
విభిన్న వర్ణవిహంగాలన్నీ
ఒక శాశ్వత సదనోన్ముఖమైనవేళ
కలలు వెలవెలా పోతాయి
సరిహద్దులు బాధతో మూలుగుతాయి
అటూ ఇటూ రెండు కత్తులుగా

గర్భస్థ శిశువులంతా నిలబడ్డప్పుడు
బిందువునుంచి నదులుగా
విత్తనంనుంచి పక్షులుగా
ఒక కొత్త యాత్ర
కలగా రూపొందుతుంది

3

చెట్టునుంచి చెట్టుకీ
పుట్టనుంచి పుట్టకీ
విత్తులు విచ్చుకునే కొత్తనేలలోకి
దారులు తెరిచే కొత్త ఆకాశంలోకి
అనంత మానవుని మజిలీలవైపు
నిరంతర యాత్రికులుగా కదలిన
జన ప్రవాహంలో
కిక్కిరిసిన మానవ బిందువులెన్నో
ఒక మహా పరంపరలా
లేళ్ళ గుంపుల్లా చెదిరి
స్వప్న శాద్వల తీరాల్లోకి
వరసలు వరసలుగా
పోక తప్పదు
ఉదయాలు వివర్ణాలయినా
ఆకాశం నీలిగుడ్డ కప్పినా
జీవన శైథిల్యంలోంచి
మూసుకుంటున్న మంచు గోరీల్లోంచి
పోక తప్పదు
అప్పుడు ఈ శరీరం కాళ్ళను విడిపించుకుంటుంది
అప్పుడు ఆకాశమే తప్పుకుని దారినిస్తుంది
మనిషికీ రెక్కలుంటాయి
రెక్కల కింద
ఒక సిందూర రేఖ, సన్నటి పడవలా జారిపోతుంది

ఇక్కడే ఇక్కడే అనుకుంటే ఎక్కడిదాకో
ఎంత దూరమో
ఇక్కడైనా బతుకుగింజ మొలుస్తుందా
ఇకనైనా ఇక్కడ మనిషి రెక్కలు
అనంతాకాశాలను ఈదకుండా ఉంటాయా!
ఇక్కడ కలల పర్వతాల మీద
పక్షులు మనుషులవుతాయా?
అనేక తీర్థాలు దాటివచ్చిన పాపాల ఫలితమిది
అనేకానేక శాపాలు తగిలి
ఒక విరామ చిహ్నాన్ని వాక్యం వెదుక్కుంటుందా
అపనమ్మకమే నమ్మకమై
అవిశ్వాసమే విశ్వాసమై
అస్థిరత్వమే స్థిరమై
క్షితిజాలు లేని లోకంలో
రెక్కలు దాచుకోవాలి
ఎక్కడా బతుకు చిగురించదనేగా
ఇంత దూరమొచ్చాం
ఎప్పుడు బతుకు మొలకెత్తదనేగా
ఇంత దూరమొచ్చాం
ఇక్కడ కూడా
నీరూ లేదు నిప్పూ లేదు
గాలీ లేదు
అనాథ కపలల్లాంటి
భూమీ ఆకాశమూ తప్ప
వీటి మధ్య దండెంలా వేళ్ళాడే పక్షుల రెక్కలు తప్ప
పచ్చటి పొలాల మధ్య
దిష్టిబొమ్మగా నుంచున్న కాలంతప్ప
ఇక్కడేముందని వచ్చాం
ఇక్కడ ఎన్ని దేహాలు ముక్కలయ్యాయో

ఎన్ని నీడలు చీలిపోయాయో
ఎన్ని రంగులు చెదిరిపోయాయో
ఒకే రంగు మాకు
ఒకే రూపం మాది
ఒకే వెలుగు దీపానికి
ఎవరెవరోగా ఈ దీపాలమీద వాలి పడుతూ
ఎవరెవరోగా మరెక్కడికో ఎగిసిపోతూ
ఎంత దూరమో
ఇప్పుడీ పాదాల కింద
కొత్తదారులు పంక్తులుగా తెరుచుకుంటున్న వేళ
పాటలు పాటలుగా ప్రవహిస్తూ
ప్రవాసమూ తప్పదు
ప్రయాణమూ తప్పదు

— — —

## తంగిరాల సుబ్బారావు

### రెండు కవితలు

### (I) సోమాలియా ఆకలి డొక్కలు

కాంగోనదికి నల్లని ఆకలి వరదలు
ఎక్కడ చూ వినా జీవన పత్రాలు రాలిపోయిన మనుషుల ఎముకలచెట్లు
అక్కడ శవానికీ మనిషికీ తేడాలేదు ఒక్క ఊసురాడడం తప్ప
సోమాలియా ఏకచక్రపురంలో కరువు బకాసురుడికి
రోజూ రెండు వందల పసి పిల్లలబలి
దశాబ్దాలుగా రగులుతున్న అంతర్యుద్ధంలో
ముక్కలు ముక్కలుగా విరిగిన దేశ గౌరవం జెండా
పిల్లల ఆహార పదార్థములు తన్నుకుపోయే దొంగ సైన్యాల గ్రద్దలు
నిత్యం విస్తరించే భయంకర క్షామ మరుభూములు
ఓ ఆకలి డొక్కల సోమాలియా!
ఓ ఎముక ముక్కల శ్మశానమా
నువ్వు ఈ శతాబ్ది మానవతకు సోకిన ఎయిడ్స్ వ్యాధివి
ఒక దేశం ఎలా వుండకూడదో నిన్ను చూసి నేర్చుకోవాలి !

## (II) యు-గో-స్లా-వి-యా ముక్కలు

మార్షల్ టిటో సమర్థపాలనా పరిమళాలు వీచిన నందనవనంలో
పిచ్చివాడు విసిరిన "పెరిస్ట్రోయికా" బాంబు
గాజుబొమ్మ నేలమీదపడి ముక్కలు చెక్కలు
జీవనదిలో నీళ్ళకు బదులు నెత్తురు
పసివాళ్లనీ పడతుల్నీ ముసలివాళ్ల ముదుసళ్లనీ మ్రింగే యుద్ధమొసళ్ళు
ప్రపంచ చరిత్రా సముద్రంలో ఇదివరకెప్పుడూ ఈ దొస్సబాడలు లేవు
సమ సమాజం వర్ధిల్లిన స్వర్గభూమిలో
జాతి భేద మరఫిరంగులు, మత మారణహోమ జ్వాలలు
పిచ్చి పోట్లాటలు, కుక్కల కొట్లాటలు
అడుగో! అటుచూడు!
వాడు ముక్కుపచ్చలారని ముద్దులు మూటగట్టే పసిబాలుడు
చంకలో సంచీ ఉన్నా స్కూలుకు వెళ్లే పిల్లవాడు మాత్రంకాడు
వాడి తల్లి దండ్రుల్ని చంపి బాంబుల భస్మాసురుడు చేసిన
అనాథ బాలుడు
భుజాన్నంటి వ్రేలాడే బుల్లి బ్యాగ్‌లో కన్నతల్లి ఉంచిన "యల్లైసి"
పాలసీ
స్లావియా-క్రోషియా-బాస్నియా-ముస్లిమ్-క్రిస్టియన్ భేదాలు వాడికి
ఫ్యాలసీ
అబ్బా!
అన్నదమ్ముల కత్తుల కోలాటం చూడలేకపోతున్నాను,
భగవంతుడా!
నాకు ఈ ప్రజాస్వామ్యం కళ్ళు వద్దు!

## చల్లా రామఫణి

### నిర్నిద్ర వ్యూహం

నేలమీద జారిపడ్డ నిర్లిప్త పదాల గోళాల మీద
కాలేసి జారిపడి
ఓ వెర్రినవ్వు వెనుక హిప్రోకటిక్
శిఖరాలను దాచుకుంటాం
అక్షర శతఘ్నుల దాడికి దాక్కునే దారిలేక
శబ్దనదుల ఘోషకు లాకులు మూసేసి
స్వర ప్రవాహాల్లో జలకాలాడటానికి వెంపర్లాడతాం
ఉత్తేజించే ఆరాధనా వ్యూహంలో ఇరుక్కున్నామని తెలియక
నిర్నిద్ర జపాలు చేస్తూ, నిబద్ధీకరణకు నామంపెట్టి
అబద్ధీకరణకు ఆయువుపోసే ఆత్మవంచనా
శిబిరాల్లో దాక్కుంటాం!
ఆత్మరక్షణకు అజ్ఞానమే అవరోధమైనపుడు
దుఃఖీకరించాల్సిన భావాలకు అక్షరాలు కరువవుతాయి !
చిత్త చాంచల్యాన్ని విత్తీకరించుకునే విఫలయత్నంలో
నోటి జైల్లో ఖైదయిన శబ్దాన్ని విముక్తం చేసి
చేపల మార్కెట్టవుతాం!
విధించుకున్న నిషేధాలను అధిగమించే ఒడుపు తెలియక
ఓడిపోవడానికి ఒప్పుకోలేని ఉడుకుమోత్తనాన్ని
నిద్రమాత్రలుగా మింగి, నిర్నిద్ర వ్యూహాలకు తెరదించి,
ఆత్మను నిద్రపరిచే యత్నంలో
అలసిపోయి ఒళ్ళు వాలుస్తాం !!

# రాజేశ్వరి దివాకర్ల

## బాధ

ఈ బాధను
భరించి పారేయాలి
సర్పంలా పెనవేసి
చుట్టుకొన్న బాధ
దర్పమంతా ధూళికెగసి
లుప్తమైన బాధ
కలువల్లాంటి కళ్ళక్రింద
నల్లని చారలు
గుండ్రమై తిరిగి
కనుబొమలను ముడివేసి
సుడి తిరిగిన బాధ
గుండె క్రింద
పొత్తి కడుపులో
సూదులై గుచ్చుకొంటూ
కంఠాన మింగుడుపడనిబాధ
కన్నీటిని
క్రిందకు రాల్చినా
ఆ బిందువులో
నీ బొమ్మ
పగులుతుందన్న బాధ
కమ్మగ నిదురరాని రాత్రి
ఉరిత్రాడై మెడకు బిగుసుకొన్నబాధ

నీవు

అసత్యమని
నమ్మలేని బాధ
నీ రక్తం
నవశిశువై
గర్భాన అవధరించిన బాధ
నిరాశ
ఉప్పెనలా పొంగుతున్న బాధ
నీవులేని జీవితం
కొనసాగుతుందనే బాధ
బాధ
నెదిరించి
బ్రతకడమే
మొండి ధైర్యపు బాధ.

# బెల్లి యాదయ్య

## గాయాల ఓటమి నుంచి

గాయాల ఓటమి నుంచే
ఊపిరి అలికిడి రావాలి,
ఈ క్షణం పలకరింపూ కరవాలనమూ జీవజలాన్నివ్వాలి,
నడిచేదారిలో........
ఎవరైతేనేం? చూపుడు వేలే ముఖ్యం-
బతికించే చెట్లన్నీ
కిలకిలారావాల్తో కలకాలం విగిర్చాలి,
ఋతుచక్రం కొమ్మల్లో
కోయిలమ్మ కొత్తగొంతు విప్పాలి,
రెప్పల్నీ........
పెదాల్నీ........
అధికారపు సూదుల్తో ఎరువుల సంచుల్లాకుట్టేసినా
గుండెనోరు ఊరుకోదు-
ఆనకట్ట నీటికేగాని అలలకెవ్వడేయగలడు-
చీకటి ఎలుకలు
ఎన్ని రాత్రులు ఊరేగినా........
వేకువ భూమిక కాంతి సంవత్సరానిదే........

# వి. ఆర్. విద్యార్థి

## ఒక గెట్-టుగెదర్‌లో

"మీ జీవితంలో సాధించాల్సిందేమిటి ?"
చాలా 'సిన్సియర్'గా తన సందేహాన్ని
వెలిబుచ్చాడొకవయోవృద్ధుడు !
—బాగా డబ్బు సంపాదించడమేనన్నాడొక వ్యాపారవేత్త,
—యీ ప్రపంచంలో అందిన సుఖాలన్నింటినీ
అనుభవించడమే నన్నాడొక సుఖలోలుడు,
—అధికారం చేజిక్కించుకోవడమే నన్నాడొక
రాజకీయవాది,
—దేశానికి నిన్ను. నువ్వు అర్పించుకోవడమేనన్నాడొక
దేశభక్తుడు,
—విప్లవాలు తేవడమే నన్నాడొక విప్లవవాది,
—గొప్ప విద్యావంతుడు కావడమే నన్నాడొక
విద్యాధికుడు,
—కొత్త విషయాల్ని కనిపెట్టడమే నన్నొడొక
శాస్త్రజ్ఞుడు,
—"సర్వం" త్యజించడమే నన్నాడొక
వేదాంతి,
—బహుశా పరాన్నభుక్కులు కాకుండా
జీవిత మంతాకష్టిస్తూ
తాను తింటూ

కష్టపడలేనివారికి కొంత పెట్టడమేకావచ్చు
అన్నాడు అందరికీ అన్నీ అందిస్తున్న
వెరరొకడు జంకుతూ !
అందరూ నోళ్ళుతెరచి ఆశ్చర్యంతో
ఆ బేరర్ వైపు చూశారు !
అంతవరకూ అందరినీ శ్రద్ధగావింటూ
కిటికీ నుండి బయటి ప్రకృతిని చూస్తూ
పరవశిస్తున్న చిన్నవయస్కుడొకరు
చివర విన్నమాటలకు ఉల్కిపడి
విప్పారిన కళ్ళతో చురుకుగాచూస్తూ
కృతజ్ఞత తెల్పుకున్నాడు ఆ కష్టజీవికి !

జయ

## పునరావృతం

అతను ప్రతీరోజూ
పొద్దుటి పూట
నేనందించిన వేడివేడి కాఫీని సిప్ చేస్తూ
ఏ పాబ్లోనెరుడా కవిత్వ చరణాల్నో నెమరేసుకుంటూ
బాల్కనీలోంచి వుదయిస్తున్న రవిబింబాన్ని చూస్తూ
కవిత్వీకరించుకుంటూ
అప్పుడే విచ్చుకుంటున్న పూల తాజా పరిమళాల్తో
వీధిలో కళ్లాపి చల్లినపుడు వచ్చే ఘాటైన
కమ్మని మట్టి సువాసనలతో
తాదాత్మ్యం చెందుతూ అక్షర రస భావనల్ని పేరుస్తుంటాడు
నేనూ ఆ కెంజాయ తొలి పొద్దులో
చలిస్తున్న రస హృదయంతో
తదేకంగా ఆ జీవన వాసంతికలను తిలకించాలని
నులి వెచ్చని రవి దంత క్షతాల రసాస్వాద తీరాల్లోకి
స్వప్నోద్దీపించి మైమరచి పోవాలని
కలలు కంటానా_
నేనొక్క క్షణం ఆ తొలివాకిట అప్రతిభురాలైనిలబడిపోతే
నా వెనుకనే
గాలి దుమారాల్లా పిల్లల ఏడుపులు
స్నానపానాల సందడులు
తొక్కిసలాడే వంటింటి హడావుడిముందు
రేసుగుర్రాల దౌడులా
ఆ మహాద్భుత వుదయ సౌందర్యం కాస్తా

మహా రణరంగమై
కంకర రాళ్ళలో నడుస్తున్నట్టు
నన్ను వూపిరి తీసుకోనివ్వదు
ఏ ఏకాంత నిశాంత సమయంలోనో
నన్ను దరి చేర్చుకున్నపుడు
మెల్లగా నా బాధను వెళ్ళగక్కి
నా కవితా వస్తువు
రగిలే స్త్రీ హృదయమని చెప్పినపుడు
కదిలిపోయి కరిగినట్టే కనిపిస్తాడు
మర్నాడు మరో పొద్దుటిపూట మంచుతెరల్లోంచి
కధ పునరావృతమవుతుంది
చర్విత చర్వణమవుతుంది
తొణుకుతూ నేనందించిన వేడి కాఫీని
యధాలాపంగా అందుకుంటూ
రాత్రి జ్ఞాపకాల ఛాయఅయినా లేకుండా
ఉదయ శోభల తీరాల్లో
కవిత్వం అంచుల్లో అతనూ_
వంట గదిలో జ్వలించే
గుండెనదిమిపెట్టి నేనూ_

# మహర్షి

—వయొలిన్ మాస్టారు

నేను
నిశ్శబ్దమై
గోదావరి ఇసుక ఒడ్డునుండి నా
చూపుల్ని
నదిమీద ప్రవహింప జేస్తుంటాను....
సాయంకాలాన్ని
ఏకాంతగా అనుభూతి చెందుతూ
ఓ
సంగీతాత్మరాకకై నిరీక్షిస్తూంటాను...
ఎక్కడో
సూర్యుడు వెలుగు ముక్కల్ని మేఘాలకు తోరణాలు కట్టి
పడమటి గూటివైపు పయస్తుంటాడు.
క్షణాల్ని, నిమిషాల్ని గులకరాళ్ళుచేసి
నదిలోకి విసురుతూ నేను
వింత శబ్దాల బాల్యానుభూతిని పొందుతుంటాను.
దూరంగా—
నా కనుకొనల్లోంచి మలుపు తిరిగిన ఓ పడవ
రెండు నీడల్ని మోసుకుంటూ నా వైపు వస్తుంది....
ఒడ్డుకు చేరుకున్న పడవలోంచి
ఒక నీడ వయొలిన్ చేతి సంచై దిగుతుంది....
ఇసుక తివాచీపై ఇద్దరం
అడుగుల రంగుల్ని ముడుస్తూ
మరో ఏకాంతాన్ని చేరుకుంటాం.

పాత సంచిలోంచి వయొలిన్ తీసి

మాస్టారు

సరిగమల పరిమళాన్ని నిశ్శబ్దమంతా

వెదజల్లుతాడు.

తన చేతివేళ్ళ వేదికపై సంగీత స్వరాల నృత్యాన్ని

ఆవిష్కరిస్తాడు.

ఆనందభైరవి రాగంలో తడిసి గోదారి

ఎర్రని మేఘాల పూలవర్షంలో తలంటుకుంటుంది....

రాత్రి నిద్రలోకి జారిపోతూ సాయంకాలం

మాపై చల్లని గాలుల దుప్పట్లు దులుపుతుంది....

వయొలిన్ మాష్టారి సంగీత పాఠాలు తీగెలమీద పలికిస్తూ

నేను విద్యార్థినవుతాను.

కాలం చెట్టునుండి రాగాల ఆకులురాల్చి పాఠం ముగిస్తాను.

సెలవు తీసుకుని మాస్టారు ఎక్కిన పడవ

చిత్రకారుడి అందమైన పెయింటింగ్‌లా నదిలో

కదులుతుంది....

గురుదక్షిణగా ఏమీ ఇవ్వలేకపోయిన పేదరికం

నా కంట్లోంచి రెండు

నీటి బొట్లుగా రాలుతుంది....!

# మల్లంపల్లి విజయకుమార్

## జీవకారుణ్యం

విశాలాన్ని పరుచుకొన్న ఆ గదిలో
నాగరికత ఒడ్డునే తెగి పడిన పక్షి ఈకలు
ఎత్తుల్ని బట్టి కాలరేఖల్ని నిర్ణయించాలేమో!
అలా హృదయం మొద్దుబారుతూనే ఉంటుంది
లేత కళ్ల వెనక గాజు కళ్ళు గుమ్ముకొంటూనే ఉంటాయి
తపన సూర్యుళ్లై వెలిగిపోతున్న ఆకాశం దేహాల్తో
ఆశ కొసన జారి వేలాడుతున్న ముఖాల్తో
దిక్కుల్ని దేవుడిగచేసి మనసు మల్లెను పెదవులపై తురుముకొంటారు
ఆనందాన్ని ధునిగా చేసినా
ఎర్ర పూలు వారి పెదాలను తాకితేనే వాడిలిపోతాయి
రాత్రి చెట్టుమీద గువ్వకూసిన అలికిడికి
వెలుగు భయం ఆవరించినవారికి
గోధూళి శరీరం ఎన్నివంకరులుగా సాగిందో
వారలా ఎంగిలి మెతుకుల్లా
సమాజం కుండీలో దొరికిపోతారు
ఓ పలకరింత వచ్చి వాలినపుడు తలలపై పందిరి వేసుకొంటారు
ఒంటరి బొట్లను మా దోసిట్లో పిండుకొంటూ
ఆసరా-అనునయం రెక్కలతో జీవిత గగన విహార చేస్తారు.

## షకూర్

### నిషేధం

ఇక్కడ—
కత్తుల్ని వదిలేసి
ఒరల్ని నిషేధిస్తుంటారు

నిషిద్ధ ఒరల అన్వేషణలో
కత్తులు కాషాయం కట్టిన తోడేళ్ళవుతుంటే
ఇక్కడ—
గొర్రెల్ని వదిలేసి
కంచెల్ని కాపలాకాస్తుంటారు

నరానరాల్లోకి ప్రాకిన నల్లమందు ప్రేరణలోంచి
శూలపాణులై ప్రభవించిన భీకరసేవకులు
సరయూనది నెత్తుటి జలాల్తో
ఆయుధశుద్ధి చేస్తుంటే
స్వరపేటికకు తాళంవేసి
దృశ్య వీక్షణలో మునిగిపోతుంది మంత్రాంగం

ఇక్కడ—
పల్లకీని వదిలేసి
పాడెను మోస్తుంటారు

శిధిల శకలాల్తో
రేపటి గద్దెను పదిలపర్చుకోటానికి
శవాల్ని పక్కకు తోసేసి
కారణాలు వెతుక్కుంటుంది రాజకీయం

ఇక్కడ—
కుబుసాల్ని బుట్టల్లోపెట్టి
పాముల్ని వదిలేస్తుంటారు
కత్తుల్ని వదిలేసి
ఒరల్ని నిషేధిస్తుంటారు

## అడిగోపుల వెంకటరత్నమ్

### ఎదురు చూపులో ఎండమావి

నడక మజిలీల చాఖలాలు వద్దు
గళం దాగిన చీకటికోణాలు వద్దు
నిన్ను నువ్వు ప్రతిష్ఠించుకోవాలి
నిన్ను నువ్వు అధిష్ఠించుకోవాలి
ఎవరో తోడు వస్తారనే ఎదురుచూపు
కనుచూపు మేరలో ఏండమావి
నీకు నిన్ను తోడుగా నిలిపే మనస్థైర్యం
వేలకు వేల స్తబ్ధతలకు మనోధైర్యం!
మెదడు మనసుల్లేని ఇంట
వనిత వంటింటి కుందేలై
శరీరం వేపుడైన ఉదంతం
శృంఖలాలు తెగని స్త్రీజాతికి ఉదాహరణ!
పొరుగింటి పుల్లగూర రుచిని
నిర్భయంగా నిలదీసిన భార్యకు
బాహాటంగా పిచ్చిని కప్పి
బంధం తెంచుకున్న భర్త ఎత్తుగడ
నిలదీసిన నిజం పిచ్చికి ఆనవాళ్ళయితే
నిజం మాట్లాడే నేనూ పిచ్చిలో అంతర్భాగమే!
అపరాధుల మధ్య చిక్కిన
నిరపరాధులు అపరాధులు కావడం
చెవులకే సమస్తం అప్పజెప్పి
కళ్ళకు గంతలు కట్టుకున్న
ధర్మదేవత ధర్మనిర్వాహం!
పాదరసం ఒక ప్రత్యేకత సంతరించుకుంది
మలినం అంటని విలక్షణం దానికుంది
ఏది నీ ప్రత్యేకత?
నిన్ను నువ్వు ప్రతిష్ఠించుకోవాలి
నిన్ను నువ్వు అధిష్ఠించుకోవాలి!

## వాణీ రంగారావు

### కానిబాల్స్ కానిబాల్స్

ఆ పనిమీదే ఉన్నాం
అనేక కల్పాల గీతాన్ని
గెలవాలనే వాంఛతో
నిర్విరామ కృషిచేస్తున్నాం
చెప్పిన – చెప్తున్న
కథలన్నింటికీ
తల ఊస్తూ
అట
అనుకుంటూ
నేనుమాత్రం ఇంకా
కష్టపడుతూనే ఉన్నా
ఎవరెక్కడ ఎందుకు
ఏ రూపంలో మార్పు కోరేరో
చేసేరు గానీ
ఇంకా ఇప్పటికీ
'కానిబాల్స్'
మా మధ్యనే ఉన్నారు
కొత్త కొత్త మేధస్సుల్తో
మనుషుల్ని భోంచేస్తున్నారు
ఎప్పుడొచ్చిందో
బ్రహ్మరాక్షసి
వృత్తో – ప్రవృత్తో
గుంపులక్రింద చీల్చేసి
లోలోపలి లోతుల్లోంచి
శక్తిని పిండేస్తోంది
అస్థిపంజరంగాగైనా మిగలనీక

మూలిగల్లోకి పాకిపోయింది
మత్తు
ఎయిడ్స్‌కన్నా ప్రమాదంగా
చీకటి ఖండాల్లో ఎక్కడో
కానిబాల్స్—
ఉన్నారు ఉంటే ఉంటారన్నది
వార్త మాత్రమే కాదు
ఇప్పుడిక్కడ
మన చుట్టూరా
చుట్టుపక్కలా
చుట్టు పక్కల్లో
నరమేధం చేస్తూ
కానిబాల్స్
కానిబాల్స్
పీడకలల్లోంచి
పీడబతుకుల్లోంచి
భయభయంగా అడుగుపెడ్తే
కల తొలిగిన కాలం
అంతా చీకటి
భయానికి రెప్పలు చలించక
ఫిక్స్ అయిపోయాయి
చూపు లేని కళ్ళు
రక్త మాంసాలతోనే ఉన్నా
ఏమీ కనిపించక
విశ్వమంతా నిండిపోయిన
కానిబాల్స్ కానిబాల్స్

(కానిబాల్స్ : మనుషుల్ని తినే మనుషులు)

కొల్లూరి

## ప్రేమ

ప్రేమంటే–
"నవ్వు" వెన్నెలై ప్రవహించడం
ప్రేమంటే
రెండు గుండెలు ఒకే గొంతుతో
అనురాగం పల్లవిగా – ఆత్మీయత చరణంగా
లలిత లలితంగా గాన శిఖరారోహణ చేయటం
ప్రేమంటే–నింగిని మించి పొంగడం
ప్రేమంటే–పడి–పాతాళాన్ని చుంబించడం

## వేశ్య

ఆమె
పాయంత్రం కాగానే
అందరి కోరికనూ కడిగే సబ్బు బిళ్ళ
ఆమె గుప్పెడు పూలలో..
కనిపించని కన్నీళ్ళు
ఆమె పెదాల నవ్వుల్లో....
భయాల బాధల మాలికలు
అమె గమన గానంలో అపశృతుల జ్వాల
అమె దుర్భర వేదనామయ జీవన గతికి
కారణమెవ్వరో....?
కాదు, ఎవ్వడో....?

# కీ. శే. బాలగంగాధర తిలక్

ఆటవెలది

## వేసవి

వాలుజడలమల్లె పూల తురిమిరేల
వీధి వీధి తావి విందులొసగి
రామ నవమినాడు రామాభిరామమౌ
తెలుగు చైత్రమెదల నిలచు నెపుడు

చందనాది లేప వారు చర్చిత గాత్ర
కింపి దుత్థ ఘర్మ వంచిత సుఖ
సుప్తి హీన సతుల చురచుర కవ్వించు
గ్రీష్మ వాన రోష్మ కేను దెలతు,

ఉత్సహింప కాంక్ష ఉడిగింప పెనువేడి
కలసి నంతలోన అలసి విడెడి
వింత కౌగిలింత లింతింత కసికాటు
లంద గించు తరుణు లందు నెందు.

## శిశిరము

లేతయెండలోన లేమ కౌగిలిలోన
సీతువొక్క స్వప్న శీధువౌను
కవితలోన మధురగాన డోలలలోన
బ్రతుకు పరిమళించు భావమౌను.

కొబ్బరాకుకొసల కూడుకొన్నది మంచు
కాదమ తేటిగొంతు పదను దివిసె
శిశిర నిశలలోన సించిత శింజినీ
స్వరముతోడ మరుడు జాలిగొలుపు.

## వెలయాలు

రాత్రి పడినయంత రంగైన వెలయాలు
వీధినిలిచి విసరె విభ్రమముల
పొలముగట్లనుచేరి పొలపొల కదలెను
పడగలెత్తి త్రాచు పాముగములు.

## చుక్క

ముసురు లేతయిరుల మునిమాపు వేళలో
చక్కనైన ఒక్క చుక్క పడుచ
మబ్బు తలుపుతెరచి మతకరి జాబిల్లి
కొరకుచూచి వేచి మరలమూసె

# అనువాద కవిత

కన్నడ కవిత :

## కె. వి. తిరుమలేశ్

### మఱ్ఱిచెట్టు

1

ఆ మఱ్ఱి చెట్టును చూండండి
దాని కింద పిల్లలెవరూ ఆడరు
చల్లగాలికి ఆకులేవీ రాలవు
దానికి ఎవరూ ఉరేసుకోలేరు
మీకు అశ్చర్యంగా ఉందా?
విశాలమైన కాండం మ్మీద
ఎలక్షను పోస్టర్లు అంటించేవారు
ఆడకూలీలు ఆ దారిలో కాసేపు ఊపిరి పీల్చుకునేవారు
చెట్టుకు ఒరిగి విశ్రాంతి తీసుకునేవారు
తుంటరి వెధవల చేతులు
దానిమీద కొంటెసూటలూ కొన్ని పేర్లు చెక్కుతూవుండేవి

2

ఆ మఱ్ఱిచెట్టును నిశితంగా పరిశీలించండి
ఎవరైనా దాని చర్మం
ముసలివాడి శరీరం లా గుండంటే
అప్పటికీ అది స్పష్టంగా చెప్పినట్టు కాదు
నిజం చెప్పాలంటే దాని వంటిమీద బెరడు కనిపించనే కనిపించదు
వేళ్ళులేని చేతుల్లా పైనుండి కిందకి సాగిన ఊడలు
చుట్టూ అలుముకున్నాయి - అని అన్నా
అప్పటికీ సత్యమేదో స్పష్టమవదు
చెట్టును చూడగానే మనసులో మెదిలేభావం
ఆదివారం, సోమవారం అనీ లేక,

విపణి వీధుల్లో చేతులు చాపుకుంటూ
వెళ్ళే గిరిజన యువతి!!

3

పోల్చడానికి పూనుకుంటే
కొన్ని విషయాలలో మనిషి చెట్టులాగా
మరి కొన్నింటిలో చెట్టు మనిషిలాగా ఉంటారు
అందువల్ల అసలు పోల్చడమే మానేద్దాం

(స్వేచ్ఛానువాదం : దేవరాజు మహారాజు)

హిందీ కవిత :

## దిలీప్ చిత్రే

### ప య న ం

గుర్తుందా?
ఆ చివరి కరచాలనం తర్వాత నీ పయనం
అంబులెన్సులో మనం ముగ్గురం
మృత్యువు వొంటరి పయనంలో
నువ్వొక్కడివి–
కునికిపాట్లూగుతూ మేమిద్దరం–
వొక సెత్తుటి గాయం
ఇక శాశ్వత విశ్రాంతి
నీ రెప్పలమించి వూగుతూ కఫన్
నువ్వు మాత్రం బిగుసుకొనిపోయి....
మేం నీ ముందు మాటైనా చదవకముందే
వున్నట్టుండి నువ్వెళ్ళిపోయావ్
ఎర్ర దీపం నీడ ముందునించి
అడుగుల్లో అడుగులేస్తున్న విటుడిలా
నెమ్మదిగా వూగుతూ అంబులెన్స్ వెళుతుంది

మేం మాత్రం భయంలోకి పరుగెత్తున్నాం
నువ్వెంత నిశ్చయంగా వున్నావిప్పుడు

2

గుర్తుందా?
ఆ చివరి కరచాలనం తర్వాత నీ పయనం
ఇప్పుడు నీ గొంతులో వో పాషాణ పువ్వు—
విద్యుత్ ప్రవాహమైన నీ
రక్తప్రసరణ ఆగిపోయింది
చూపు తీగ తెగిపోయింది
గుర్తుందా?
ఆ చివరి క్షణాల్లో మా వెంట నువ్వున్నావ్

నిన్నంతా మృత్యువు ఆక్రమించి....
నాకిప్పటికీ జ్ఞాపకమే
ఆ చీకటి అంచు చివరి క్షణాలు
స్ట్రెచర్ మీద మోసుకెళ్ళి
చావుకబురు చల్లగా చెవిలో వూదారు—
దుఃఖం కాన్సర్‌లా వుప్పొంగుతోంది
దుఃఖం కాపుసారాలా వుడుకుతోంది
దుఃఖం నల్లమందై వంచిస్తుంది
ఇంతెందుకూ? దుఃఖం మృత్యువుకు నీడ
విచిత్రం వొక్కోసారి
శత్రువుల్ని భరించడం కంటె
ఆత్మీయుల్ని భరించడమే కష్టమవుతూంది

3

నీకు ఉత్తరమైనా రాయలేను
టెలిగ్రామూ ఇవ్వలేను
నేనొంటరిని
సజీవిని

ఇది నా రెండో ప్రయాణం
గుర్తుందా?
ఏప్రెల్‌లో వొక ఆదివారం ఉదయం
మా వెంట నువ్వున్నావ్
నీ పక్కలో ఎముకల్ని నములుతూ మృత్యువు–
అన్నీ వాటంతటవే జరిగిపోతున్నాయి
ఉదయం ...మధ్యాహ్నం....రాత్రి....
మొక్కా....చెట్టూ....మోడు
మంటల్లో వో శవం........
నాకేం గుర్తులేదిప్పుడు
నీ చివరి పయనానికి కేంద్ర బింధువులో నేనున్నాను .
నీ వెనుకే నా పయనం........

[దిలీప్ చిత్రే "అంబులెన్స్ మే సఫర్" దీర్ఘకవితలోంచి కొంత భాగం]
(స్వేచ్ఛానువాదం : ఇక్బాల్‌చంద్)

కన్నడ కవిత :

## హేమా పట్టణశెట్టి

### శాంతి మా సూత్రం

ప్రేమికుల ప్రేమ, ఆలు మగల గొడవలు
పిల్లల మొండి, అత్తకోడళ్ళ తగవులు
రచ్చకెక్కడం
ఈ కాలపు ఈ దేశపు విషాదం కావాలా?
ఇంటి మాట మదిలోని మాట
రామాయణం నాటినుండి మహాభారతమై
రచ్చకెక్కి నిలచింది నిజం. అయినా
లోపల బయట ఒకటి కావాలని
లోపలివన్నీ బయట పెట్టడం ఎలా సాధ్యం?
నేడు కుంభకోణాలే నిండిన

ఈ దేశాన్ని భారత దేశాన్ని మనం
కాశ్మీర్అనో పంజాబనో
ఆంధ్రఅనో పిలుస్తున్నాం!
ఏలేవారు ఏలుతుంటే
తక్కినవారు బానిసలు కావడం
పాడై పోవడం
మన దేశపు నుదిటిరాత కావాలా ?
వ్యక్తిగత మైనది సార్వజనికమై
రాజకీయ మైనది రాజాజ్ఞయై
అనైక్యతను ఐక్యత అంటే
దేశం కాదు దేశం
ఇల్లు ఇల్లు కాదు.
మనముందిప్పుడు నిలచే ప్రశ్న–
ఇల్లును దేశం గావించడమా?
కాదు
దాని అర్థంతోనే
ఇల్లును నిలబెట్టడం
అలా అయినప్పుడు
శాంతి
మా మంత్రమూ సూత్రమూ అవుతుంది.

(అనువాదం: ఎన్. రఘునాథ్)

తమిళ కవిత :

## పార్తిబన్

### మాకిస్తే

రాజకీయ నాయకుల్లారా!
తోరణాలు కట్టే దారాలు మాకివ్వండి
పావడా నాడాలుగా పనికివస్తాయి
"కట్ అవుట్"కు పెట్టే
ఖర్చులో కాస్తంతయినా మాకివ్వండి

కనీసం గంజి అయినా తాగుతాం
పోస్టర్లు అంటించే
పిడికెడు పిండి యివ్వండి
ఆకలితో అలమటించే పసిపాపలకు పనికివస్తుంది
కాసేపు వేసుకు పారేసే
మాలలు మాకివ్వండి
మా "శవాలు" సువాసనలతో కదలిపోతాయి

(అనువాదం : ఆచార్య కె. సర్వోత్తమరావు)

## గోకులన్ కీర్తి

### ప్రభుత్వ కార్యాలయాలు

అక్కడ
మెట్లుకూడా – కనిపిస్తేచాలు
పళ్ళికిలిస్తాయి
అక్కడ
కుర్చీలుకూడా–చేతులుసాచి
ఆహ్వానిస్తాయి
అక్కడ
బల్ల సొరుగులు - పొట్టలు చూపి
బావురుమంటాయి
అక్కడ
జేబులన్నీ - అదోరకం విన్యాసంచేసి
సలాములు కొడతాయి
అక్కడ
కాని పనులన్నీ - కనుసైగలతోనే
చకచకా సాగిపోతాయి
అది
అల్లావుద్దీన్ అద్భుత దీపం
వింతలు కానే కావు
అవన్నీ
ప్రజాప్రభుత్వ కార్యాలయాలు

(అనువాదం : ఆచార్య కె. సర్వోత్తమరావు)

ఇంగ్లీషు కవిత :

## ఆలోచన — నక్క

ఈ నడిరాత్రి_అడవిలో ఆలోచన
గడియారపు నిశ్శబ్దమూ
కాగితంపై కదుల్తోన్న చేత్తోబాటూ
ఏదో కదుల్తోంది జోరుగా
కిటికీలోంచి చూశా. నక్షత్రమేమీ లేదు
మరింత దగ్గర్లోనే
చిమ్మ చీకట్లోనైనా
వస్తోంది నిశ్శబ్దంలోకి
మబ్బు మంచులా, చల్లగా, మెత్తగా
ఓ నక్కమూతి తాకుతోంది కొమ్మనూ, రెమ్మనూ ;
కళ్ళు రెండు ఒకే కదలిక
కదుల్తూ, అప్పుడప్పుడూ
పాదాల్ని మంచులో ముద్రిస్తూ
చెట్లనడుమ, మెల్లగా, జాగ్రత్తగా
ఓ కుంటి నీడ
శరీరంలోంచి ధైర్యంగా
బయళ్ళను దాటి వస్తుంది ఒకే చూపు
విశాలమైన, దీర్ఘమైన పచ్చదనం
తెలివిగా, గాఢాలోచలో
తన పనిలో తానే నిమగ్నమైంది
అంతలోనే వాడైన, వేడైన నక్క వాసన
వస్తోంది చీకటి తలభాగంలోకి
కిటికీలో నక్షత్రం కానరాదిప్పటికీ ;
గడియారం కదుల్తోంది ; కాగితంపై మాటలు ముద్రించబడ్డాయి,

(ఆంగ్లకవి టెడ్ హ్యూస్ "థాట్-ఫాక్స్"కు స్వేచ్ఛానువాదం)

హెూషాంగ్ మర్చంట్ ఆంగ్ల కవితలకు స్వేచ్ఛానువాదం

## 1) ఆ క లి

ఆకలి తీర్చుకోడానికి
హెూటల్ కెళ్ళిన నేను
ప్రేమలో పడ్డా
టిఫిన్ అందించే ఆతనితో
నా అకలి కడుపులోనిది కాదు
హృదయంలోనిది
నా హృదయాన్ని పళ్ళెంపై పరచి
అందింవా నేనతనికి

(పోలోగ్ : "ఫూడ్" కవితకు అనువాదం)

## 2) పళ్ళెం విరిగి...

పళ్ళెం వీరిగి
దెబ్బతిన్న తనచేత్తో
కాఫీ అందింవాడతడెంతో ప్రేమతో
కలం పట్టిన ఈ చేయి
అన్నం పెట్టే తన చేతికి
కట్టు కట్టగలిగితేనో!

(సర్వీస్ : 26 జూలై 1991 కవితకు అనువాదం)

## 3) శ్రీనివాస్

తిరుపతి కెళ్తా రెందరో
ఎన్నెన్నో కోరికల్తో
శ్రీనివాసుని పేరు పెట్టుకున్నా
కాసుండదు జేబులో
నేనూ ప్రేమిస్తున్నానో శ్రీనివాసుని
దయలేని శిలని
మట్టితో చేయబడ్డ దేవుడు
బల్లల మధ్య తిరుగుతున్నాడీరోజు

("శ్రీనివాస్" కవితకు అనువాదం)

## 4) కోయిల

పుస్తకాల్లో కోయిల గొంతు
వినపడదిక్కడ
నిరాటంకంగా పాడుతోందాక కోయిలగొంతు
పంజరంలో బంధింపబడ్డా
పాడుతాయీ కొన్ని పక్షులు

("నైటింగేల్" కవితకు అనువాదం)

[హెూఫాంగ్ మద్పంట్ కవితలు - హెూటల్ గోల్కొండ నుండి గ్రహింపబడ్డాయి. హెూటల్ గోల్కొండ రైటర్స్ వర్క్‌షాప్, కలకత్తా నుంచి వెలువడింది].

# చైతన్య కవితా వేదిక

బెంగుళూరు

అధ్యక్షులు : శ్రీ డి. కె. ఆదికేశవులు

ఉపాధ్యక్షులు : 1. శ్రీ బుల్లా సుబ్బారావు, ఐ. ఎ. ఎస్.
2. శ్రీ సకలా నరసింహులు
3. శ్రీ కరుటూరి సూర్యారావు

కార్యదర్శులు : 1. ఆచార్య తంగిరాల, సుబ్బారావు
2. డా. ఆర్వీయస్ సుందరం

కోశాధికారి : ఆచార్య నరగు కృష్ణమూర్తి

సహకార్యదర్శులు : 1. శ్రీ పి. యు. బి. శర్మ
2. డా. ఎం. రుక్మాంగదనాయుడు

## 1992లో చేరిన సభ్యులు

పోషక సభ్యులు

శ్రీయుతులు :

1. కుమారి డి. ఎ. కల్పజ (శ్రీ డి, కె. ఆదికేశవులుగారి కుమార్తె), బెంగుళూరు.
2. డా. ఖాజాపీర్, ఆచార్యులు, విద్యాశాఖ, బెంగుళూరు విశ్వవిద్యాలయం, బెంగుళూరు.
3. శ్రీ పి. వెంకటేశ్వరరావు, రిటైర్డ్ ఎగ్జిక్యూటివ్ ఇంజనీర్, గుంటూరు.
4. శ్రీమతి వనం లక్ష్మీనరసమ్మ, శ్రీ వనం జనార్దనశర్మ దంపతులు ఆస్పరి, కర్నూలు జిల్లా.

## ప్రత్యేక సభ్యులు

శ్రీమతి ఎన్. రాజేశ్వరి, హైదరాబాదు

కుమారి పి. మాధవి, వాయల్పాడు

